s u n d a y   m a g a z i n e

25 జూన్ 2017

# ఆదివారం ఆంధ్రజ్యోతి





## ATM లక్ష్మీ యంత్రం @ 50

ఫిల్మ్‌నగర్









# ‘టాయ్‌లెట్’ కోసం...!

**ప్రధాని నరేంద్ర మోదీ ‘స్వచ్ఛ భారత్’ స్ఫూర్తిగా ఒక సినిమా రూపొందుతోంది. అదే ‘టాయ్‌లెట్ ఏక్ ప్రేమ్ కథ’. ఇందులో భూమి పెడ్నేకర్ కీలక భూమిక పోషిస్తోంది. అత్తారింట్లో టాయ్‌లెట్ నిర్మాణం కోసం పోరాడే మహిళగా భూమి మరోసారి విభిన్న పాత్రలో కనిపించనుంది. గతంలో ‘దమ్ లగాకే హైసా’లో లావుపాటి భార్యగా నటించి అనేక అవార్డులు అందుకున్న భూమి చెబుతున్న విశేషాలు ఆమె మాటల్లోనే...**

- సినిమాల్లో పనిచేయాలనేది నా కల. అందుకే ఉన్నత చదువులవైపు వెళ్లకుండా మా నాన్నతో చర్చించి ఖరీదైనప్పటికీ సుభాష్‌ఘాయ్ యాక్టింగ్ స్కూలులో చేరాను. అప్పటికింకా నా వయసు పదహారు మాత్రమే. చిన్నపిల్ల చేష్టలు పోలేదు. దాంతో నటన సరిగా నేర్చుకోలేకపోయాను. అదే సమయంలో నా ఫ్రెండ్ ద్వారా యష్‌రాజ్ ఫిల్మ్స్‌లో అసిస్టెంట్ కాస్టింగ్ డైరెక్టర్ పోస్ట్‌కు ఇంటర్వ్యూలు జరుగుతున్నాయంటే వెళ్లి సెలెక్ట్ అయ్యాను.

- ‘చక్ దే ఇండియా’, ‘రాకెట్ సింగ్’, ‘తీన్‌పత్తీ’ సినిమాలకు కాస్టింగ్ డైరెక్టర్‌గా చేసిన అభిమన్యు రే నా బాస్. ఆ తర్వాత షానూ శర్మ గ్రూపులో చేరాను. ఆరేళ్ల పాటు యష్‌రాజ్ ఫిల్మ్స్‌లో కాస్టింగ్ డైరెక్టర్ నుంచి అసిస్టెంట్ డైరెక్టర్‌దాకా అన్ని పనులు చేశా.

- ‘దమ్ లగాకే హైసా’కు కూడా నేనే కాస్టింగ్ డైరెక్టర్‌ను. అయితే డైరెక్టర్ శరత్ కటారియా నన్నే సెలెక్ట్ చేస్తాడనుకోలేదు. అందులో హీరోయిన్ లావుగా ఉండాలి. అప్పటికి నేను 65 కిలోల బరువున్నాను. సంధ్యావర్మ పాత్ర కోసం 90 కిలోల దాకా బరువు పెరిగాను. బట్టర్ చికెన్, దాల్ మకానీ, పిజ్జాలు విపరీతంగా తినేదాన్ని. ఆ సినిమా విడుదలైన తర్వాత మళ్లీ మామూలు సైజుకు రావడానికి చాలా కష్టపడ్డా.

- 2016లో ఫిల్మ్‌ఫేర్ నుంచి ఐఫా దాకా ‘బెస్ట్ ఫీమేల్ డెబ్యూ’ అవార్డులన్నీ నాకే రావడం విశేషం.

- షారుక్, సల్మాన్‌లకు వీరాభిమానిని. వారి సినిమాలు చూస్తూ పెరిగాను. నా దృష్టిలో వాళ్లిద్దరూ కేవలం సినిమా హీరోలు కాదు. రియల్ హీరోలు. అవకాశమొస్తే వారి సరసన నటించాలని ఉంది.

- ముంబయిలో ఇప్పటికీ నేను ఆటోల్లో తిరుగుతుంటా. రోడ్డు పక్కన పానీపూరీలకు రెగ్యులర్ కస్టమర్ని. నా ముద్దుల చెల్లెలు సమీక్షతో కలిసి సిటీ అంతా తిరగడమంటే భలే ఇష్టం.

- యష్‌రాజ్ ఫిల్మ్స్‌తో మూడు సినిమాలు చేయాలనే కాంట్రాక్ట్ ఉంది. ‘మన్‌మర్‌జియా’ సినిమా (ఇందులో కూడా ఆయుష్మాన్ ఖురానాయే హీరో) కోసం పంజాబీ యాసతో పాటు, మోటార్‌బైక్ నడపడం, హాకీ ఆడటం వంటివి నేర్చుకుంటున్నా.

- ‘టాయ్‌లెట్ ఏక్ ప్రేమ్ కథ’లో అక్షయ్‌కుమార్ వంటి స్టార్ సరసన నటించడం నా అదృష్టంగా భావిస్తున్నా. నా జీవితంలో మర్చిపోలేని అనుభూతి ఇది. సగటు మహిళ ఎదుర్కొంటున్న ఒక సీరియస్ సమస్య గురించి సెటైరికల్‌గా సినిమా తీయాలనుకోవడం దర్శకుడు శ్రీ నారాయణ్ సింగ్ గొప్పదనం.



# INSIDE





**లక్ష్మీ యంత్రం @ 50**

సరిగ్గా ఐదు దశాబ్దాల క్రితం అందుబాటులోకి వచ్చిన ఏటీఎంలు బ్యాంకింగ్ స్వరూపాన్నే మార్చేశాయి. సకల సేవలనూ ఓ డబ్బాల్లోకి తెచ్చేశాయి.

7



**అమిష్**

'శివ ట్రయాలజీ'తో పుస్తక ప్రపంచంలో సంచలనం సృష్టించిన యువ రచయిత అమిష్. నాస్తికుడైన అమిష్ శివభక్తుడిగా మారి, పురాణాలను నవతరానికి కొత్తగా పరిచయం చేస్తున్నాడు.

12


మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33కు, మెయిల్ ద్వారా sunday.aj@gmail.comకు పంపండి.




## మిత్రవాక్యం

చిమ్మ చీకటి. హోరుగాలి. చిన్నగా చినుకులు. కనుచూపుమేరా నరమానవుడు కూడా కనిపించడు. భయంభయంగా అడుగులేస్తుంటాం. బిక్కుబిక్కుమంటూ వెనక్కి తిరిగి చూసుకుంటే... వేపచెట్టు. జుట్టు విరబోసుకున్న దెయ్యంలా అనిపిస్తుంది. ప్రైప్రాణాలు పైనే పోతాయి. అదే, ఆత్మవిశ్వాసంతో తలతిప్పి చూస్తే... అప్పటిదాకా జడల దెయ్యంలా అనిపించిన వేపచెట్టే వేయి అక్షౌహిణుల సైన్యమై మన వెనకాలే నడుస్తున్నట్టు ఉంటుంది. ఎక్కడలేని ధైర్యం వచ్చేస్తుంది. మంచి-చెడు, పాజిటివ్-నెగెటివ్, ధైర్యం-అధైర్యం... మన మానసిక స్థితిని బట్టి మారి పోయే ఉద్వేగాలు. ఏకాంతం, ఒంటరితనం... కూడా దాదాపుగా అలాంటివే. చాలా సందర్భాల్లో మన పక్కన ఎవరూ లేరనో, మన గోడు ఎవరూ వినడం లేదనో తెగ బాధపడిపోతుంటాం. ఒంటరివాళ్లమన్న ఆలోచన రాగానే... ప్రపంచమంతా ఒక్కటై మన మీద కుట్రపన్నిందేమో అన్నంత నిస్పృహ ఆవరిస్తుంది. అదే, ఒంటరితనాన్ని ఏకాంతమని భావిస్తే... అద్భుత వరంలా గోచరిస్తుంది. మనల్ని మనం బేరీజు వేసుకోడానికీ, మన లోపలికి మనం ప్రయాణించడానికీ అదో మంచి అవకాశమని అనిపిస్తుంది. ఆ ఒక్క తేడా కారణంగానే... జైలుపాలై, ఊచల మధ్య ఒంటరి జీవితాన్ని గడిపి... శిక్ష పూర్తిచేసుకుని ఇంటికి తిరిగొస్తున్న సమయానికి కొందరి చేతిలో డిగ్రీ పట్టాలుంటాయి, మరికొందరి బుర్రల్లో భూతాలుంటాయి. ■



## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ రియల్ హెచ్చరిక

ఈ వారం కవర్‌స్టోరీ 'మాయా లేదు.. మంత్రం లేదు.. వర్చువల్ రియాలిటీ' మనందరికీ ఒక హెచ్చరికలా అనిపించింది. ఒకప్పుడు విద్యార్థుల్లో ఊహాశక్తిని పెంచేలా తరగతి గదుల్లో చార్ట్‌లు గీసి పెట్టేవాళ్లు. వాటిని చూసి అర్థం చేసుకోడానికి విద్యార్థులకు బాగా టైమ్ పట్టేది. ప్రస్తుతం డిజిటల్ క్లాస్‌రూమ్స్ వచ్చేసి, అంతా తెర మీదే బొమ్మేసి చూపిస్తున్నారు. ఇది విద్యార్థులకు విషయం పట్ల కావల్సినంత 'క్లారిటీ' తెచ్చినా, వారిలోని ఊహాత్మక శక్తిని నశింప జేస్తుంది. ఆలోచించాల్సిన అవసరం తగ్గిపోతుంది. ఈ 'వీఆర్' వల్ల ఇప్పుడూ అదే జరగబోతుందేమో!

**- సత్యప్రసాద్,** విజయవాడ

### ◆ 'జంతుదాదా' జిందాబాద్

ఆప్యాయత చూపిస్తూ, ఆనందాలను పంచుతూ మనుషుల అనారోగ్యాన్ని అమాంతం దూరం చేస్తున్న థెరపీ జంతువుల గురించి తెలుసుకుని ఆశ్చర్యపోయాం. కల్తీ మందులతో, చేతకాని సర్జరీలతో, అనవసర పరీక్షలతో రోగుల ప్రాణాలను తీసే కొందరు వైద్యుల కంటే ఈ 'జంతుదాదా ఎమ్‌బీబీఎస్'లే చాలా బెటర్.

**- కళావతి తలయూర్,** చెన్నై

### ◆ అన్నీ పడగలేనా?

'వెయ్యి పడగలు' కథ స్త్రీవాద సాహిత్యాన్ని ప్రతిబింబించింది. తండ్రి, తమ్ముడు, తాళి కట్టిన మొగుడు, నమ్మించి మోసం చేసిన ప్రేమికుడు... ఇలా మగాళ్ళందరినీ ద్వేషించిన ఐశ్వర్య, తన తప్పును మాత్రం తెలుసుకోకపోవడం ఆశ్చర్యం. మగాడిని నమ్మి మోసపోవడమే కాదు, మొగుడిని నమ్మించి మోసం చేయడమూ తప్పే కదా!

**- నజీర్ బాషా,** నెల్లూరు

### ◆ సంగీతాచారి

వీరుడిలా పోరాడడం కంటే, పోరాడే వందమంది వీరులను తయారుచేయడం చాలా కష్టమైన విద్య. పాటలు పాడి పేరు తెచ్చుకోవడం కంటే, మంచి సింగర్లని తయారుచేయడమే తన జీవిత ప్రయాణంగా ఎంచుకున్న 'కె. రామాచారి' చెప్పిన విషయాలు బాగున్నాయి. సంగీతం నేర్పడాన్ని దైవారాధనతో పోల్చిన ఆయన వ్యక్తిత్వం అనుసరణీయం.

**- సాయికిరణ్,** హైదరాబాద్

### ◆ ఆత్మా... ప్రేతాత్మ

'ఆత్మల వేటగాళ్లు!' కథనం ఆసక్తికరంగా ఉంది. దెయ్యాలను వెళ్లగొట్టే భూతవైద్యులు, మంత్రగాళ్లకు గిరాకీ పడిపోవడంతో... లేటెస్టు టెక్నాలజీ ఉన్న యంత్రాలను వాడి హైటెక్కు హంగులతో ఇలా 'పారానార్మల్ పరిశోధకుల' రూపం ఎత్తారేమో అనిపిస్తోంది. ఎంతయినా దెయ్యం కంటే భయం మహా చెడ్డది కదా!

**- ఎస్. అనూష,** హైదరాబాద్

# అరె, మళ్లీ పడి పోయిందా...

'ఆర్య2' సినిమాలో హీరోయిన్ కాజల్ అగర్వాల్‌కు ఓ వింత అలవాటు ఉంటుంది. కోపమొస్తే చాలు, చేతిలోని సెల్‌ఫోన్‌ను నేలకేసి కొడుతూ ఉంటుంది. బయట కూడా ఇలాంటి అలవాటు ఉన్నవాళ్లు చాలామందే కనిపిస్తారు. ఆ బాపతు బాబాయిలకు కోపం కనుక వచ్చిందంటే, సెల్లు ఘొల్లుమనాల్సిందే! అసలు, మన దేశంలో ఎంతమంది మొబైల్ ఫోన్లను పడగొట్టేసుకుంటున్నారు? ఎందుకు? ఎలా? ఏమిటి?... అనే ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవాలనుకుంది 'కార్నింగ్' అనే సంస్థ. మొబైల్ ఫోన్లకు గొరిల్లా స్క్రీన్ గ్లాసులను తయారుచేసే ఈ కంపెనీ, అనుకుందే తడువుగా ఒక సర్వే నిర్వహించింది. అందులో... ఆసక్తికరమైన విషయాలు తెలిశాయి. అవేమిటంటే...



## 'చేజారే' ఫోబియా!

మనదేశంలో 61 శాతం మంది దాకా సెల్‌ఫోన్ వాడకం దారులు... ఫోన్ కిందపడితే ఎక్కడ స్క్రీన్ పగిలిపోతుందోనని తెగ భయపడిపోతూ ఉంటారట. ఇదొరకమైన ఫోబియాగానూ మారుతోం దట. ఆశ్చర్యకరమైన విషయ మేంటంటే, ప్రస్తుతం ఎక్కువ మందిని భయపెడుతున్న సమస్య కూడా ఇదే.






## అన్నీ గీతలే...




మనకు పెద్ద ఫోన్లు వాడాలన్న ఆరాటం ఎక్కువ. అదీ ఖరీదైనదే కావాలి. కానీ, వేలకువేలు పోసి కొన్న స్మార్ట్‌ఫోన్‌ను జాగ్రత్తగా ఉంచుకోవడం మాత్రం తెలియదు. దాదాపు 33 శాతం మంది సెల్ ఫోన్ల మీద.... తెర సైజులో 40 శాతం దాకా గీతలే ఉంటాయి.

## ఇంట్లోనే ధమాల్!




ఇంట్లో ఉన్నా, ఆఫీసులో పనిచేస్తున్నా, వీధుల్లో నడుస్తున్నా.... ఎక్కడ ఉన్నా, ఏం చేస్తున్నా చేతిలో సెల్‌ఫోన్ అంటూ ఉండాల్సిందే. అంతలా, మన శరీరంలో ఒక భాగమైంది. కానీ, ఇంట్లో ఉన్నప్పుడే సెల్‌ఫోన్లు ఎక్కువగా కిందపడుతున్నాయని అధ్యయనంలో వెల్లడైంది. ఇంట్లో పడేసే వాళ్లు 93 శాతం మంది ఉండడమే దీనికి సాక్ష్యం. ఆఫీసులో నేలపాలైపోతున్న ఫోన్లు రెండో స్థానంలో, వీధుల్లో చేజారుతున్న ఫోన్లు మూడో స్థానంలో ఉన్నాయి.

## జాగ్రత్త సార్..

ఫోన్ మాట్లాడుతూ, సెల్ఫీ దిగుతూ, మెసేజీలు పంపిస్తూ... ఫోన్లు పడేసుకుంటున్నవారే అధికం. ఎంత ఎత్తు మీద నుంచి పడి సెల్‌ఫోన్లు పగులుతున్నాయన్న విషయానికొస్తే... సగటున, 5 అడుగుల 24 అంగుళాల ఎత్తు నుంచీ ఠప్పున పడిపోతున్నాయ్. అంటే, మనిషి భుజం కంటే కాస్త తక్కువ ఎత్తు నుంచే!




## ఫోర్ టు టెన్!




స్మార్ట్ ఫోన్లు వాడుతున్నవారిలో ఇరవై ఎనిమిది శాతం దాకా, ఏడాదిలో నాలుగు సార్ల కంటే ఎక్కువగానే ఫోన్లు కిందపడేస్తున్నారు. ఎనిమిది శాతం మంది, పది సార్ల కంటే ఎక్కువగానే చేజార్చుకుంటున్నారు. చాలా సందర్భాల్లో జాగ్రత్త పెరిగిన కొద్దీ నష్టం పెరిగిపోతూ ఉంటుంది.



## మాట్లాడుతుంటే....




సరే, ఇంట్లోనే ఎక్కువగా పగుల్తున్నాయని అనుకుందాం. కానీ, ఎప్పుడు పగుల్తున్నాయ్ - అంటారా? 62 శాతం మంది విషయంలో.... మాట్లాడుతుండగానే చేజారిపోతున్నాయి. మెసేజీ టైప్ చేస్తున్నప్పుడు పడిపోతున్నవీ (25 శాతం) తక్కువేం కాదు. ఉత్తిగా నడుస్తున్నప్పుడు పడిపోవడం మాత్రం (13 శాతం)కాస్త తక్కువే.

# సుబ్రహ్మణ్యం మాం పాహి...

**ఆరోగ్య, సంతాన, శాంతి, ఆనంద దాంపత్య ప్రదాతగా సుబ్రహ్మణ్యేశ్వర స్వామి భక్తజన మనోమందిరాలలో కొలువుతీరి ఉంటాడు. సుబ్రహ్మణ్య ఆరాధనతో కుజ, సర్పాది దోషాలు తొలగి పోతాయంటారు. వల్లీదేవసేనా సమేత సుబ్రహ్మణ్యేశ్వర కల్యాణోత్సవాలు లోక కల్యాణకారకాలు. (జూన్ 29న కుమార షష్ఠి).**

సుబ్రహ్మణ్యస్వామికి అనేక నామాలు. కుమారస్వామి, షణ్ముఖుడు, కార్తికేయుడు, వేలాయుధుడు, శరవణభవుడు, సేనాపతి, స్వామినాథుడు, మురుగన్ తదితర పేర్లతో స్వామి పూజలందుకొంటాడు. సమ్మోహన రూపంతో మురిపిస్తూ ఉంటాడు కనుక, మురుగన్ అంటూ తమిళ సోదరులు సభక్తికంగా పిలుస్తుంటారు. కుమార అనే పేరులో స్వామి అవతార పరమార్థం కనిపిస్తుంది. కుమారస్వామిని పూజిస్తే శివుడినీ శక్తినీ, లక్ష్మీనీ నారాయణుడినీ పూజించినట్టేనని పెద్దలు వివరిస్తున్నారు. దానికి కారణమేమిటంటే... ప్రకృతి పురుషుల ఏకత్వమే కుమారస్వామి అవతార తత్త్వం.

ఈ స్వామికి కుమార అనే పదమే తొలి నామమని పురాణకథలు చెబుతున్నాయి. కుమారస్వామి జననం తాత్త్విక దృష్టితో కూడి ఉంటుంది. మిగిలిన పేర్లలో షణ్ముఖుడు అంటే ఆరు ముఖాలు కలిగినవాడని అర్థం. కార్తికేయుడు అంటే కృత్తికా నక్షత్ర సమయంలో అవతరించాడనీ; వేలాయుధుడు అంటే శూలం ఆయుధంగా కలిగినవాడనీ; శరవణభవుడు అంటే పవిత్రమైన శరవనం (అంటే రెల్లుగడ్డి) విస్తరించిన వనంలో జన్మించినవాడనీ; గాంగేయుడు అంటే గంగకు జన్మించినవాడనీ; సేనాపతి అంటే దేవతా సేనలకు అధిపతి అనీ అర్థాలు చెబుతారు. స్వామినాథుడు అనే పేరు శివుడికి ప్రణవమంత్ర అర్థాన్ని చెప్పినందుకు వచ్చింది. సుబ్రహ్మణ్యుడు అంటే బ్రహ్మజ్ఞానం కలిగినవాడు. వల్లి, దేవసేన... కుమారస్వామి భార్యలు. ఈ స్వామి బ్రహ్మజ్ఞాన స్వరూపుడైతే వల్లీదేవి ఇచ్ఛాశక్తికి, దేవసేనాదేవి క్రియాశక్తికి స్వరూపాలు. షణ్ముఖుడు అనే పేరును యోగపరంగా అన్వయిస్తుంటారు. ఆరు ముఖాలూ షట్చక్రాలకు ప్రతీకలని చెబుతారు.

## కాలస్వరూపుడు

షణ్ముఖుడు కాలస్వరూపుడు. కాలమంటే ఒక సంవత్సర పరిమాణాన్ని తీసుకోవచ్చు. అలా తీసుకున్నప్పుడు సంవత్సరానికి ఆరు ఋతువులుంటాయి. పన్నెండు మాసాలుంటాయి. స్వామికి ఉన్న ఆరు ముఖాలే ఆ ఆరు ఋతువులు. ఆయనకుండే పన్నెండు చేతులే పన్నెండు మాసాలు. ఇక ఆ స్వామి వాహనం నెమలి. దాని పేరు చిత్రాగ్ని. ఇది కూడా ఓ గొప్ప ఆధ్యాత్మిక భావన. నెమలి మీద కన్పించే రకరకాల రంగులు సృష్టిలోని వివిధ వర్ణాలను ప్రకాశింపచేసే కాంతి పుంజానికి ప్రతీక. ఇలా చూస్తే కాలచక్రంలోని ప్రతిక్షణంలోనూ షణ్ముఖుడు కొలువుతీరి ఉంటాడు. కాలాన్ని వృథా చేయటమంటే దైవాన్ని విస్మరించటమే.

## అవతార వైభవం

కుమారస్వామి జననానికి సంబంధించి ఇతిహాసాలలో ఎన్నో కథలున్నాయి. వాటిలో స్కందపురాణం మరింత హృద్యంగా వివరిస్తోంది. పూర్వం తారకాసురుడనే రాక్షసుడు ముల్లోకాలలోని సజ్జనులనూ బాధిస్తుండేవాడు. శివుడికి జన్మించిన కుమారుడు తప్ప మరెవరూ ఆ రాక్షసుడిని సంహరించలేరని బ్రహ్మ వల్ల తెలుసుకున్న దేవతలు శివుడి దగ్గరకు వెళ్లి ప్రార్థించారు. తన తేజస్సు నుంచి కుమారుడు జన్మిస్తాడని శంకరుడు దేవతలకు అభయమిచ్చాడు. ఆ తర్వాత రుద్రుడి తేజస్సు భూమిమీద పడింది. భూమి భరించలేక అగ్నికిచ్చింది. అగ్ని కూడా భరించలేక జలరూపంలో ఉన్న గంగకిచ్చాడు. గంగ కూడా శివతేజాన్ని భరించలేక హిమాలయాలలో ఉన్న పవిత్రమైన శరవనం అనే రెల్లుగడ్డి ఉన్న వనంలో విడిచిపెట్టింది. అక్కడ శరవనభవుడు ఆరు ముఖాలతో జన్మించాడు. ఋషిపత్నులైన ఆరుగురు కృత్తికలు షణ్ముఖుడికి స్తన్యం ఇచ్చి పెంచారు. అలా ఆ స్వామి అవతరించి తారకాసురుడిని సంహరించాడు. ఆ సంహారవేళ తారకుడి మెడలో ఉన్న శివలింగం అయిదు ముక్కలైంది. ఆ అయిదు ముక్కలు పడిన ప్రాంతాలే శివపంచారామ క్షేత్రాలయ్యాయి.



## మేధస్సుకు ప్రతీక

కుమారస్వామినే సుబ్రహ్మణ్యస్వామి అని అంటారు. జ్ఞానస్వరూపుడైన ఈ స్వామి మంచి మేధస్సును ప్రసాదిస్తాడు. ఆ మేధస్సుకు ప్రతీకగా ఆయన చేతిలో శక్తి అనే ఆయుధం ఉంటుంది. బహుముఖమైన ప్రజ్ఞ కావాలనుకునేవారు షణ్ముఖుడైన సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధిస్తుంటారు. కార్తికేయుడిని కవి అనే పేరుతోనూ శాస్త్రాలు కీర్తించాయి. పోతనలాంటి మహాకవులు శరవనభవుడిని స్మరించారు. రామాయణంలో విశ్వామిత్ర మహర్షి రాక్షస సంహారం కోసం రామలక్ష్మణులను వెంట తీసుకువెళుతూ కుమారస్వామి జన్మ వృత్తాంతాన్ని వివరించాడు. దేవసేనలకు అధిపతి అంటే సంపూర్ణ శక్తిస్వరూపుడని అర్థం. అంతటి శక్తిని పొందటానికీ జ్ఞానాన్ని సొంతం చేసుకోవటానికీ సుబ్రహ్మణ్య ఆరాధన ఉపకరిస్తుంది. కేవలం పురాణాలలోనే కాక తంత్ర శాస్త్రంలో కూడా సుబ్రహ్మణ్యస్వామి విశిష్టత కనిపిస్తుంది. ఈ స్వామి దేవేరులలో వల్లీదేవి కుండలినీ శక్తికి ప్రతీక. ఇంద్రియ శక్తులకు ప్రతీకగా దేవసేనాదేవిని చెబుతారు పెద్దలు. తమిళనాట తిరుత్తణి, పళని, తెలుగుగడ్డ మీద మోపిదేవి సుప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రాలు. ఆ స్వామి సర్పావతారుడు అన్న భావనతో నాగులచవితి, నాగపంచమి లాంటి పర్వదినాలలో కూడా సుబ్రహ్మణ్య ఆరాధన కనిపిస్తుంది.

- శ్రీమల్లి,
98485 43520






# యాక్షన్ సినిమాలను అనుకరిస్తున్నాడు!

PARENTING

**మేడమ్... మా అబ్బాయి తరచూ బొమ్మ తుపాకులతోనే ఆడుకుంటాడు. టీవీలో ఎక్కువగా హాలీవుడ్ యాక్షన్ సినిమాలు చూస్తుంటాడు. అందులోని నటీనటులను అనుకరిస్తూ బొమ్మ తుపాకులను గురిపెట్టి ఫైరింగ్ చేస్తున్నట్టుగా ఫీలవుతాడు. మామూలు బొమ్మల జోలికి అస్సలు వెళ్లడం లేదు. నాకు వాడి వ్యవహారం చూస్తుంటే భయమేస్తోంది.**

**- దుర్గా ప్రసాద్, కర్నూలు**

మీ అబ్బాయి వయసెంతో చెప్పలేదు. అయితే ప్రశ్న మీకే వేస్తున్నా. మీ పిల్లాడు బయట ఆటలకు వెళ్లకుండా అంతసేపు టీవీ ఎందుకు చూస్తున్నాడు? పిల్లలు తప్పకుండా బయట ఆడుకునేందుకు ప్రోత్సహించాల్సింది తల్లిదండ్రులే. సినిమాలకు, వాస్తవానికి తేడా ఏమిటన్నది వారికి తెలిసేలా చెప్పాలి. పిల్లలు వయసుకు తగ్గ సినిమాలు చూస్తే పర్వాలేదు కానీ, తరచూ యాక్షన్ సినిమాలు చూడటం మంచిది కాదు. సాధారణంగా హాలీవుడ్ సినిమాలకు వయసును బట్టి సర్టిఫికేషన్ ఉంటుంది. అంటే ఫలానా వయసులో ఉన్నవాళ్లు ఆ సినిమా చూడొచ్చా లేదా అని స్పష్టంగా పేర్కొంటారు. ఇదే విషయాన్ని పిల్లలతో చర్చించి వారి ఏజ్‌గ్రూప్‌కు అవసరమైన సినిమాలే చూడమనాలి. హింసను ప్రేరేపించే సినిమాలు అతిగా చూడటం వల్ల తమకు తెలియకుండానే ఆయా సన్నివేశాలను అనుకరిస్తూ ఉంటారు. క్రమంగా అలాంటి మెంటాలిటీ పెరుగుతుంది. సో... సాధ్యమైనంతగా మీ పిల్లాడికి ఔట్‌డోర్ గేమ్స్ పరిచయం చేయండి. అందులోని మజాను ఆస్వాదించేలా ప్రోత్సహించండి. అవి శారీరకంగా, మానసికంగా పిల్లల ఎదుగుదలకు తోడ్పడతాయి కూడా.

**మేడమ్... నా పిల్లలిద్దరూ టీనేజ్‌లో ఉన్నారు. వాళ్ల పనులన్నీ ఇప్పటికీ నేనే చేస్తున్నా. ఏది అవసరమైనా నా భర్త, నేనూ చేసిపెడుతున్నాం. ఇలా ప్రతీదానికీ మా మీదే ఆధారపడితే ఎలా? పిల్లలు పెరిగి పెద్దవుతున్న కొద్దీ ఇండిపెండెంట్‌గా ఉండాలి కదా. అలా ఉండాలంటే ఏం చేయాలి?**

**- విష్ణుప్రియ, వరంగల్**

టీనేజ్ గ్రూప్ అంటే సహజంగా 12-16 ఏళ్ల మధ్య ఉంటారు. సరిగ్గా అదే సమయంలో తల్లిదండ్రులు వారిని భవిష్యత్తులో ఎదుర్కోబోయేవాటికి సిద్ధం చేయాల్సి ఉంటుంది. స్కూల్ నుంచి అప్పుడప్పుడే కాలేజీకి, హాస్టళ్లకు వెళ్తుంటారు కాబట్టి వాళ్లిద్దరికీ మెల్లి మెల్లిగా కొన్ని పనులు అప్పగించడం ప్రారంభించండి. ఆ పనులు పూర్తిచేసేలా వారిని మోటివేట్ చేయండి. అవసరమైతే చిన్న చిన్న బహుమతులు కూడా ఇవ్వండి. ప్రశంసించండి. వారి పనులు వారే చేసుకోవాలని చెబుతూనే, అందుకు అవసరమైన సాయం చేయండి. ఇలా చేయడం వల్ల టీనేజ్ పిల్లలు క్రమక్రమంగా ఇండిపెండెంట్‌గా తయారవుతారు. కాలేజీకి, హాస్టల్‌కు వెళ్లేప్పటికే ఆ పనులు వారికి అలవాటవుతాయి కాబట్టి, ఎవరూ ఇబ్బంది పడకుండా ఉంటారు.

**నా స్నేహితురాలికి టీనేజీ పిల్లలున్నారు. ఆమె తన పిల్లల్ని అందరి ముందూ కొడుతుంది. నలుగురి ముందూ పిల్లల్ని అలా దండించకూడదని నేను చెబితే... అలా చేస్తేనే వారికి గుణపాఠంగా ఉంటుందనీ, ఇంకెప్పుడు తప్పు చేయరనీ సమర్థించుకుంటోంది. ఆమె వాదన సరైనదేనా? 'పబ్లిక్ షేమ్' అనేది మంచిదేనా?**

**- పుష్ప, బెల్లంపల్లి**

మొట్టమొదట మనం అర్థం చేసుకోవాల్సింది ఏమిటంటే... అందరిముందూ పిల్లల్ని కొట్టడమనేది ఎంతమాత్రం మంచిది కాదు. దీని వల్ల పిల్లలకు భయం పుడుతుందే కానీ మరేం కాదు. ఆ భయం వల్ల చేసిన తప్పును అర్థం చేసుకునే స్థితి కూడా వారికి ఉండదు. పిల్లలు చెప్పిన పని చేయకపోతే, తెలిసీ తెలియక ఏదైనా తప్పు చేస్తే... ఎందుకలా జరిగిందో తెలుసుకుని, వారికి అర్థమయ్యేలా చెప్పాలేగానీ దండించడం వల్ల వాళ్లు మరింత మొండిగా మారే ప్రమాదముంటుంది. పిల్లల పట్ల తల్లిదండ్రులు ప్రేమగా ఉండాలే గానీ వారికి శత్రువులుగా మారకూడదు. తరచూ అందరి ముందూ కొడుతూ ఉంటే, కొన్నాళ్లకు ఆ దెబ్బలకు అలవాటు పడిపోయి షేమ్‌గా అస్సలు ఫీలవ్వరు. పైగా తల్లిదండ్రులంటే గౌరవం కూడా పోతుంది. అది మరింత ప్రమాదకరం. అందుకే పిల్లలతో సాధ్యమైనంతగా మాట్లాడాలి. తాము చేసిన తప్పు వారికి అర్థమయ్యేలా వివరించాలి. అంతేగానీ బహిరంగంగా వారిని పనిష్ చేస్తే మీ కసి తీరవచ్చేమోగానీ వారిలో మాత్రం ఎలాంటి మార్పు రాదు. 'పబ్లిక్ షేమ్' ఏ రూపంలో ఉన్నా, అది పిల్లల భవిష్యత్తుకు మంచిది కాదు.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

*మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.*
***అడ్రస్ : ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, మెయిల్ ఐడి : sunday.aj@gmail.com***

**కవర్ స్టోరీ**

# లక్ష్మీయంత్రం @ 50




**ఏటీఎంతో మన అవసరం ఆలూమగల అనుబంధం లాంటిది. విసుక్కుంటాం. తిట్టుకుంటాం. ఎగతాళి చేస్తాం. జోకులేస్తాం. అదంతా ఆ కాసేపే. అంతలోనే, 'ఎక్కడున్నావ్ బంగారం!' అంటూ వెతుక్కుంటూ వెళ్తాం. 'పాస్‌వర్డ్'తో రహస్య సంకేతం పంపుతాం. టన్నులకొద్దీ ప్రేమతో టచ్‌స్క్రీన్ బుగ్గ గిల్లుతాం. ఆ మాత్రం అనురాగానికే పొంగిపోతుంది. కరెన్సీ కాగితాల్ని కానుకగా అందిస్తుంది. ఆ యంత్రమాలక్ష్మికి అప్పుడే యాభై ఏళ్లు!**

'మీ పెద్దబ్బాయి ఏం చేస్తున్నాడోయ్?' - 'ఐసీఐసీఐ బ్యాంక్‌లో ఉన్నాడు..'
'చిన్నోడు?' - 'యాక్సిస్ బ్యాంక్, ఎల్బీనగర్ బ్రాంచి...' - 'మరి, కూతురు?'
'ఎస్బీఐ...' - 'అబ్బో అందరివీ బ్యాంకు ఉద్యోగాలే?'
'కాదోయ్! ఆ బ్యాంకుల దగ్గర క్యూలో నిలబడ్డారు'

---

'సార్! కెనరా బ్యాంకు బ్రాడీపేట బ్రాంచి ఇక్కడి నుంచీ ఎంత దూరం? ఎలా వెళ్లాలో కాస్త చెబుతారా?'

'ఒకటిన్నర కిలోమీటరు ఉంటుంది. వరుసలో నా వెనక నిలబడితే గంటకో రెండు గంటలకో చేరుకోవచ్చు. నేనూ అక్కడికే. ఏటీఎంలో డబ్బు తీసుకోడానికి'

---

'నేను ఏ మెషీన్ దగ్గర ఎక్కువ సమయం వర్కవుట్ చేస్తే... అమ్మాయిల్ని అయస్కాంతంలా ఆకట్టుకుంటాను' అడిగాడు అరవింద్ ఫిట్‌నెస్ నిపుణుడిని.

'ఏటీఎం మెషీన్' జవాబిచ్చాడు ట్రెయినర్.

---

'భర్తలు భార్యల్ని బట్టలు ఉతికే మెషీన్లులా, అంట్లు తోమే మెషీన్లులా, ఇల్లు ఊడ్చే మెషీన్లులా చూస్తున్నంత కాలం... భార్యలు భర్తల్ని ఏటీఎం మెషీన్లుగా చూస్తే తప్పేమిటంట' - ఓ వేదిక మీద స్త్రీవాద నాయకురాలు.

---

ఒకటా రెండా, నోట్ల రద్దు సమయంలో, ఆతర్వాతా, అంతకుముందూ.... ఏటీఎం (ఆటోమేటెడ్ టెల్లర్ మెషీన్)ల మీద లెక్కలేనన్ని జోకులొచ్చాయి. వచ్చినవన్నీ పేలాయి. ఆ పరాచికంలోనూ బోల్డంత ప్రేమ ఉంది.

మోదీ పుణ్యమాని, ఒక్కసారిగా ఏటీఎంలకు ఎక్కడలేని ప్రాధాన్యం వచ్చేసింది. అప్పటిదాకా మనకు, ఎప్పుడు కావాలంటే అప్పుడు... ఎంతకావాలంటే అంత డ్రా చేసుకుని వచ్చేయడమే తెలుసు. కార్డుంటే, ఆ కార్డులో డబ్బుంటే... జేబులోనే ఉన్నంత భరోసా! ఆ విశ్వసనీయతా, ఆత్మీయతా... కష్టాల్లో ఆదుకునే స్నేహితుడినో, బంధువునో 'నా ఏటీఎం గాడు...' అని ముద్దుగా పిలుచుకునేంతదాకా వచ్చింది. ఇప్పటికి కూడా, ఇన్నిన్ని ఇ-వ్యాలెట్‌లు వచ్చాక కూడా... ఏటీఎంల అవసరమేం తగ్గలేదు. ఇంకాస్త పెరిగిందనే చెబుతాయి గణాంకాలు. నిజమే, ప్రతి సగటు జీవికీ... ఎక్కడ ఏటీఎం కనబడినా, అవసరమున్నా లేకపోయినా ఎంతోకొంత డ్రా చేసుకోవాలనే అనిపిస్తుంది. తీవ్ర కరువు పరిస్థితుల తర్వాత, గ్రామీణ ప్రజల్లో ఒక రకమైన అభద్రత వచ్చేస్తుంది. రేపన్నది ఎలా ఉంటుందో అన్న భయంతో రాశులకొద్దీ గింజల్ని గాదెల్లో దాచుకుంటారు. ఇదీ అలాంటి మానసిక స్థితే. అందులోనూ, భారత్ లాంటి దేశాల్లో 'క్యాష్ ఈజ్ కింగ్'. ఆ రాజు గారి కటాక్షం కావాలంటే, ఏటీఎం రాణెమ్మను బతిమాలుకోవాల్సిందే. రవివర్మ పెయింటింగ్‌లో లక్ష్మీదేవి అరచేతి లోంచి బంగారు నాణాలు రాలి పడుతున్నట్టు... ఏటీఎంలోంచి

ప్రపంచ వ్యాప్తంగా నగదు రహిత లావాదేవీలు యాభైరెండు శాతం పెరిగాయి. అలా అని, ఏటీఎంల నుంచి ఉపసంహరణలూ ఏమాత్రం తగ్గలేదు. నిజానికి, ముప్పైమూడు శాతం పెరిగాయి కూడా. అందులోనూ భారత్‌లో నోట్ల రద్దు తర్వాత, జనంలో కరెన్సీ పట్ల ప్రేమ మరింత అధికమైంది.

భారత్‌లో ఈ ఐదేళ్లలో ఏటీఎంల సంఖ్య రెట్టింపు అయ్యింది. 2012లో మన దగ్గర 90, 525 ఏటీఎంలు ఉండేవి. ప్రస్తుతం ఆ సంఖ్య రెండు లక్షలా పదివేలకు చేరుకుంది. బ్యాంకులు ఆన్‌లైన్ లావాదేవీల్ని ప్రోత్సహించే ఉద్దేశంతో ఏటీఎంల ఏర్పాటుకు కోతలు పెడుతున్నాయి. అందుకే ఈ మందగమనం.

దక్షిణ కొరియాలో, అత్యధికంగా ప్రతి లక్షమంది ఖాతాదారులకూ, దాదాపు మూడొందల ఏటీఎంలు ఉన్నాయి. ఇదో ప్రపంచ రికార్డు. అదే భారత్‌లో లక్షమందికి గానూ ఇరవై దాకా ఉంటాయి. దక్షిణ సుడాన్‌లో అయితే, లక్షమందికి ఒక్క మెషీన్ కూడా లేదు.

కరెన్సీ నోట్లు జారిపడుతుంటే... ఆత్రంగా అందుకుని ఆబగా లెక్కబెట్టుకునే అనుభవం ప్రతిసారీ కొత్తగానే ఉంటుంది. కాకపోతే తేదీ మారేకొద్దీ, ఏటీఎంకు వెళ్తున్నప్పుడు మన హావభావాలు కూడా మారిపోతూ ఉంటాయి. ఒకటో తేదీన దర్జాగా వెళ్తాం. పదిహేనో తేదీన బిక్కుబిక్కుమంటూ బయల్దేరతాం. ఇరవై ఐదున ఫలితాలు చూసుకోడానికెళ్తున్న లాటరీ పిచ్చోడిలా... మహా ఆత్రంగా కార్డు ఇన్‌సర్ట్ చేస్తాం. అడుగుబొడుగున చిల్లరపైసలేమైనా మిగిలిపోయి ఉంటే, ఊడ్చుకొచ్చేద్దామన్న ఆశ... కాదుకాదు దురాశ!

ప్చ్... పైసా కూడా గిట్టుబాటు కాదు. బాధ ఎగదన్నుకొచ్చేస్తుంది. బతుకు మీద విపరీతమైన విరక్తి పుట్టేస్తుంది. అర్జునుడు కురుక్షేత్రంలో విల్లంబులు వదిలేసినట్టు మనమూ కార్డును ఓ మూలకి విసిరేసి, 'వెధవ జీవితం... వెధవ సంపాదన. ఈ జానా బెత్తెడు బతుకూ ఓ బతుకేనా' అంటూ వైరాగ్యంలోకి దిగిపోతాం. ఆ సమయంలో ఐదడుగుల ఏటీఎం అంతెత్తు పరమాత్మలా గోచరిస్తుంది. 'కష్టములకు కుంగనివాడూ సుఖములకు పొంగనివాడూ స్థితప్రజ్ఞుండు అనబడును...' అంటూ హితబోధ చేస్తున్నట్టు అనిపిస్తుంది. నూట అరవై ఎనిమిది గంటల తర్వాత రాబోయే ఒకటో తారీకును ఊహించుకుంటూ నిర్లిప్తంగా ఇంటికి వచ్చేస్తాం. శ్మశాన, ప్రసూతి వైరాగ్యాల్లాంటిదే... ఏటీఎం వైరాగ్యమూ!

### యాభై ఏళ్లక్రితం....

ఏటీఎంలు మన జీవితాల్లోకి వచ్చి మహా అయితే రెండూ రెండున్నర దశాబ్దాలే కావచ్చు. కానీ వాటి పుట్టుక మాత్రం... యాభై ఏళ్లక్రితం జరిగింది. జూన్ 27, 1967న లండన్ శివారు ప్రాంతంలోని ఓ బ్యాంకులో ఏటీఎం అందుబాటులోకి వచ్చింది. ఆతర్వాత రెండేళ్లకు అమెరికాలోని లాంగ్ ఐలండ్ ప్రజలకు పరిచయమైంది. 'మా తలుపులు పొద్దున్నే తొమ్మిదింటికి తెరుచుకుంటాయి. ఇక మూసుకోవు..' అంటూ సగర్వంగా బోర్డు తగిలించుకున్నారు ఆ బ్యాంకు వాళ్లు. జాన్ షెపర్డ్ అనే వ్యక్తిని ఏటీఎం సృష్టికర్తగా చెబుతున్నా, భిన్న వాదనలు వినిపిస్తున్నాయి. గొప్ప ఆవిష్కరణలకు ప్రచారం అక్కర్లేదు. బ్రాండింగ్ బాజాభజంత్రీలూ అవసరం లేదు. అతి కొద్దికాలంలోనే ఏటీఎం ప్రపంచమంతా పాకిపోయింది. ప్రస్తుతం విశ్వవ్యాప్తంగా ముప్పై లక్షల ఏటీఎంలు ఉన్నట్టు అంచనా. త్వరలోనే ఇంకో పది లక్షలు పెరిగే ఆస్కారం ఉంది.

మనిషి చరిత్రలో క్రీస్తుపూర్వం, క్రీస్తుశకం లాగా... బ్యాంకుల చరిత్రలో ఏటీఎంకు ముందు, ఏటీఎం వచ్చాక.... అన్న విభజన అనివార్యమైపోయింది. నిజమే, ఇదేమైనా చిన్నాచితకా ప్రభావమా? బ్యాంకుల చుట్టూ ప్రదక్షిణలు చేయాల్సిన పన్లేదు. క్యాషియర్ గారు సీట్లో ఉన్నారా, సిగరెట్టు కాల్చుకోడానికి వెళ్లారా అన్నది పట్టించుకోవాల్సిన తలనొప్పి లేదు. పాస్‌బుక్‌లో పద్దులు రాయించుకోడానికి పడిగాపులు పడాల్సిన కష్టమే లేదు. ఎయిర్ కండిషన్డ్ ఏటీఎం గదిలోకెళ్లి.... దర్జాగా కార్డు గీకేసి.... దర్పంగా నోట్లు పట్టుకుని వచ్చేయడమే. వేలిని ఎంగిలి చేసుకుని ఓపిగ్గా ఎంచుకోవాల్సిన పనీ లేదు. అంత పర్ఫెక్ట్! కాకపోతే తొలి రోజుల్లో కార్డుల్లేవు. చెక్కులతోనే పని జరిగిపోయేది. చెక్కు మీది సంతకాన్ని ఏటీఎం సరిచూసుకుని నగదు చెల్లించేది. అదనంగా ఓ పిన్ నంబరు అవసరమయ్యేది. ఈ వ్యవస్థ ఎంతోకాలం సాగలేదు. ఆ స్థానంలో ప్లాస్టిక్ కార్డులు వచ్చేశాయి. మొదట్లో ఏటీఎం మీద ఎన్నో సందేహాలు! మీట నొక్కగానే మెషీన్ డబ్బు ఇస్తుందంటే ఓ పట్టాన నమ్మకం కలిగేది కాదు. ఆ డబ్బాలో ఎవరో కూర్చుని లావాదేవీలు నిర్వహిస్తున్నారని బలంగా అనుమానించేవారు. 'ఇదిగో బాబూ.... కాస్త చిల్లరుంటే ఇవ్వు. అన్నీ వంద రూపాయలే అయితే పనులెట్టా అవుతాయీ... నిన్నే, వినిపిస్తోందా?' అంటూ యంత్రాన్ని బతిమాలుకున్నవారూ ఉన్నారు. అయినా, మనుషుల్ని నమ్మడానికే భయపడిపోతున్న రోజుల్లో... యంత్రాల్ని ఎలా నమ్మగలం? అసలు నోట్లు ఇస్తుందో, నకలీ నోట్లు

నీటి మీద తేలాడే 'ఫ్లోటింగ్ ఏటీఎం'ను ఏర్పాటు చేసిన ఘనత భారతీయ స్టేట్ బ్యాంక్‌దే. కేరళలోని లంకల్లో నివసిస్తున్న ప్రజల ఆర్థిక అవసరాలు తీర్చడానికి ఈ ఏర్పాటు చేసింది. భారతీయ యుద్ధనౌక ఐఎన్ఎస్ విక్రమాదిత్యలోనూ ఓ ఏటీఎం ఉంది. ఇది కూడా ఎస్‌బీఐ ఏర్పాటు చేసిందే. విక్రమాదిత్యలో పనిచేస్తున్న పదిహేనువందలమంది నౌకాదళ సిబ్బందీ అక్కడే డబ్బు డ్రా చేసుకుంటారు.



# ఇలా పనిచేస్తుంది

1. కీపాడ్ : ఇక్కడే ఖాతాదారులు నాలుగు అంకెల 'పిన్' నమోదు చేస్తారు. ఆ వివరాలు సంకేత రూపంలో సంబంధిత బ్యాంకుకు వెళ్తాయి.
2. క్యాష్ డిస్పెన్సర్ : లావాదేవీ పూర్తయిన వెంటనే,క్యాష్ ఛాంబర్‌లోని నగదు 'రోలర్ మెకానిజం' ద్వారా డిస్పెన్సర్‌కు చేరుతుంది. ఖాతాదారుడు ఆ మొత్తాన్ని తీసుకోవచ్చు. ఆలస్యమైతే డబ్బు వెనక్కి వెళ్లినా వెళ్లిపోతుంది.
3. రిసిట్ స్లాట్ : లావాదేవీ వివరాలు ముద్రించిన రసీదును ఇక్కడే తీసుకోవచ్చు.
4. రోలర్స్ : ఏ రెండు నోట్లూ అతుక్కుని రాకుండా ఈ రోలర్లు జాగ్రత్త తీసుకుంటాయి.
5. సక్షన్ కప్స్ : రోలర్లు ముందుకు పంపడానికి పూర్వమే ఒక్కో నోటునూ వేరు చేస్తాయి.
6. స్క్రీన్ : ఇదే ఏటీఎంకు కళ్లూచెవులూ అన్నీ. టచ్ స్క్రీన్ మీద కనిపించే ఆప్షన్స్‌తో లావాదేవీని కొనసాగిస్తాడు ఖాతాదారుడు.
7. కార్డ్ స్లాట్ : కార్డు లోపలికి పెట్టగానే, ఇందులోని బ్లాక్ మాగ్నటిక్ స్ట్రిప్స్... కార్డులోని వివరాల్ని వడపోస్తుంది. అవసరమైతే లావాదేవీని తిరస్కరిస్తుంది.
8. రిజెక్ట్ బాక్స్ : యంత్రంలోంచి వచ్చిన నోట్లలో తేడా ఉన్నా, అందులో చెల్లని కరెన్సీ ఉన్నా ఆ మొత్తం రిజెక్ట్ బాక్స్‌లో పడిపోతుంది. ప్రక్రియ మళ్లీ మొదటినుంచీ జరుగుతుంది.
9. డిపాజిట్ బాక్స్ : చెక్కులు లేదా నగదు డిపాజిట్ చేసినప్పుడు, అవన్నీ డిపాజిట్ బాక్స్‌లో పోగవుతాయి.
10. క్యాష్ ఛాంబర్ : ప్రతి ఛాంబర్‌లో వేలకొద్దీ నోట్లు ఉంటాయి. సాధారణంగా బ్యాంకులు వంద, ఐదొందలు, రెండు వేలు ఇలా అన్నిరకాల నోట్లనూ అందుబాటులో ఉంచుతాయి.



చేతిలో పెడుతుందో? లెక్క తేడా వస్తే ఎవర్ని డగాలి? ఓ గంట ఆలస్యమైనా ఫర్వాలేదు బ్యాంకుకే వెళ్తాం, క్యాషియర్ దగ్గరే తీసుకుంటాం? - అంటూ మంకుపట్టుపట్టిన మహానుభావులూ ఉన్నారు. ఏటీఎం అందరి అనుమానాల్నీ పటాపంచలు చేసింది. ఏడాది రెండేళ్లకే పరిస్థితులు దార్లోకొచ్చాయి. ఏటీఎంల దగ్గర రద్దీ పెరగసాగింది.

భారతదేశానికి సంబంధించినంత వరకూ... 1990 ప్రాంతంలో మహానగరాల ప్రజలకు తొలిసారిగా పరిచయమైంది ఏటీఎం. అదీ హెచ్ఎస్‌బీసీ లాంటి విదేశీ బ్యాంకుల చొరవ తోనే. ఆర్థిక సంస్కరణల పుణ్యమాని కొత్తగా పుట్టుకొచ్చిన ప్రైవేటు బ్యాంకులు .... ఆ కొద్దిపాటి సమయంలోనే, కొత్త శాఖల్ని ఏర్పాటు చేసుకునే అవకాశం లేక, ఏటీఎంలను బరిలోకి దించాయి. ఆ ప్రయోగం విజయ వంతం కావడంతో, జాతీయ బ్యాంకులూ యంత్ర మంత్రమే పఠించాయి.

**'క్రైమ్'జోన్...**

ప్రతి ఆవిష్కరణనూ ఓ ముప్పు వెంటా డుతూ ఉంటుంది. ఏటీఎంకూ ఆ కష్టం తప్ప లేదు. డెబిట్‌కార్డులకూ, క్రెడిట్ కార్డులకూ నకి లీలు సృష్టించి అమాయకుల ఖాతాల్లోని వేల కువేల సొమ్ము కుమ్మేసుకుపోతున్న ముఠాలు చాలానే ఉన్నాయి. ఇంత జరుగుతున్నా, ఆ 'కార్డ్ క్లోనింగ్' ముఠాల పనిపట్టలేక పోతున్నాయి 'సైబర్‌క్రైమ్' విభాగాలు. కొంత మంది 'టెక్' నేరగాళ్లు ఏకంగా ఏటీఎం కేంద్రాల్నే స్వాధీనంలోకి తెచ్చుకుంటున్నారు. జాతీయ స్థాయిలో... ఈ మూడేళ్లలో ముప్పై ఏడువేల ఏటీఎం మోసాలు నమోదు అయ్యాయి. ఒక్క ఏడాది కాలంలోనే పోలీ సులు ఎనిమిది వేలమందిని అరెస్టు చేశారు. దేశంలోని దాదాపు రెండున్నర లక్షల ఏటీఎంలలో యాభైశాతం దాకా పాత చింత కాయ పచ్చడి ఆపరేటింగ్ సిస్టమ్‌తోనే పనిచే స్తున్నాయి. అప్‌గ్రేడ్స్ గట్రా లేనేలేవు. ఇలాంటి యంత్రాల్ని స్వాధీనంలోకి తీసుకోవడం హ్యాకర్ల కు చిటికెలో పని. ఆ తరహా సైబర్ నేరాలకు పాల్పడుతున్నది కూడా కరడుగట్టిన నేర స్తులేం కాదు. చాలావరకూ కాలేజీ విద్యార్థులే. విలాసాల మోజులో అడ్డదారి సంపాదనల కోసం ఇ-నేరాల్ని ఎంచుకుంటున్నారు. చెన్నై కుర్రాడు ప్రేమ్ మన్వానికి టెక్నాలజీ అంటే పిచ్చి. కాలేజీ ఎగ్గొట్టి నెట్ కెఫేలలో కాలక్షేపం చేసేవాడు. అప్పుడే, 'ఏటీఎంలోని లొసుగులు తెలుసుకోండి.... లక్షలు సంపాదించండి' అన్న ఆన్‌లైన్ ప్రకటన కనబడింది. ఇదేదో ఆసక్తిక రంగా ఉందనిపించి ఇంకాస్త లోతుకు వెళ్లాడు. ఆ ప్రకటన వెనుక ఓ అంతర్జాతీయ ముఠా ఉంది. ఒక్కో కార్డు వివరాలూ ఇవ్వడానికి ఆ ముఠా ఇంత మొత్తమని వసూలు చేస్తుంది. ఆ అంకెల సాయంతో ఎవరెవరి ఖాతాల నుంచో, ఎంత డబ్బయినా డ్రా చేసుకోవచ్చు. అడ్డదార్లో ప్రేమ్ పాతిక లక్షల దాకా సంపాదిం చుకున్నాడు. ఓ బలహీన క్షణంలో పోలీసులకు దొరికిపోయి, ఊచలు లెక్కబెడుతున్నాడు.

ఇక, దేశంలో నిరక్షరాస్యతకు కొదవ లేదు. ఏటీఎంల దగ్గర వరుసలో నిలుచున్న అమాయకుల్ని మోసం చేయడం మరీ తేలిక. అప్పటికప్పుడు సాయం చేసినట్టు నటిస్తూనే... పాస్‌వర్డ్ తెలుసుకుంటారు. డ్రా చేసిన డబ్బు నయాపైసలతో సహా చేతిలో పెట్టి... ఏ కాలం చెల్లినకార్డో తిరిగి ఇచ్చేస్తారు. అసలుసిసలు కా ర్డు మాత్రం మోసగాళ్ల చేతిలోనే ఉండిపో తుంది. ఓ ఐదు నిమిషాల్లో ఉన్నదంతా

ఊడ్చేసుకుని వెళ్లిపోతారు. గునపాలు పట్టుకుని వచ్చి మరీ... ఏటీఎంలను బద్దలుకొట్టే దర్జా దొంగలూ చాలామందే ఉన్నారు. నెత్తిన టోపీ లాంటిదేదో పెట్టుకుంటే చాలు, నిఘా కెమెరాలు కూడా పట్టుకోలేవు. తెల్లారేలోపు పని పూర్తిచేసుకోవచ్చు.

సాంకేతిక చోరులు ఎంత తెలివి మీరుతున్నారంటే... సాధారణంగా ప్రతి ఖాతా నుంచీ సొమ్ము తీసుకోడానికి ఓ పరిమితి అంటూ ఉంటుంది. సిస్టమ్‌ను హ్యాక్ చేసి, ఆ లక్ష్మణరేఖను కూడా తుడిచేస్తున్నారు. ఖాతాలో ఎంత సొమ్ము ఉంటే అంతా దొంగలపాలే. ఆమధ్య జపాన్‌లో ఓ ముఠా పక్కాగా వ్యూహరచన చేసి... దక్షిణ ఆఫ్రికాలోని స్టాండర్డ్ బ్యాంకు నుంచి డేటా సేకరించింది. దాంతో ఏకకాలంలో పద్నాలుగు వేల ఏటీఎంల నుంచి నగదు తీసుకోవాలని పన్నాగం పన్నింది. కుట్ర భగ్నం కావడంతో ఓ గండం తప్పింది.

నగరం నడిబొడ్డా, శివారు ప్రాంతమా అన్న తేడా లేదు. ఏటీఎం చుట్టుపక్కల ఓ అర కిలోమీటరు మేరా.... నేరాలకు అనువైన ప్రాంతమేనని పోలీసు రికార్డులు చెబుతున్నాయి. ఏ వంద రూపాయల నోటో కింద పడేసి...'అరే! మీ డబ్బు పడిపోయింది మాస్టారూ!' అంటూ దృష్టి మళ్లించే ముఠాలు లెక్కలేనన్ని. ఒంటరి మహిళల్నీ వయోధికుల్నీ బెదిరించో భయపెట్టో నగదును దోచుకెళ్లిపోయే దొంగల సంఖ్యా తక్కువేం కాదు. ఏటీఎం కేంద్రాల్లో హత్యలూ హత్యా ప్రయత్నాలూ కూడా జరిగాయి. బ్యాంకుల వాళ్లు ఖర్చుల విషయంలో కక్కుర్తిపడిపోయి, ఏటీఎంల భద్రతను ప్రైవేటు ఏజెన్సీలకు అప్పగించడంతో ఈ ఇబ్బంది వస్తోంది. సిబ్బంది చేతివాటం వల్ల కావచ్చు, అక్కడక్కడా అసలు సిసలు కరెన్సీ మధ్యలోకి దొంగనోట్లూ జొరబడుతున్నాయి. ఆమధ్య దిల్లీలోని ఓ ఏటీఎం నుంచి పిల్లలు ఆడుకునే బొమ్మనోట్లు వచ్చాయి. కారణం ఏమైనా, బాధ్యులు ఎవరైనా ఏటీఎంల మీద జనానికున్న నమ్మకానికి తూట్లు పొడిచే లోటుపాట్లే ఇవన్నీ.




**పాస్‌వర్డ్ భద్రత విషయంలో చాలామందికి అవగాహన లేకపోవడం కూడా ఏటీఎం మోసాలకు కారణమే. ఇ-మెయిల్ నుంచి ఏటీఎం దాకా అన్నిటికీ ఒకటే పాస్‌వర్డ్ పెట్టుకుంటారు. హ్యాకర్లు ఏ ఒక్కటి తెలుసుకోగలిగినా, గుట్టు రట్టయినట్టే. సులభంగా ఊహించడానికి వీలున్న... 1234, ఏబీసీడీ వగైరా పాస్‌వర్డ్‌లు కూడా కొంప ముంచేస్తాయి. కొంద రైతే కార్డు వెనకాలే పాస్‌వర్డూ రాసుకుంటారు. ఇంకేముంది, దొంగ చేతికి తాళం ఇచ్చినట్టే.**

## ఇంకా తికమకే

సాంకేతికంగా ఎంతోకొంత మెరుగుపడినట్టు అనిపించినా, 'యూజర్‌ఫ్రెండ్లీ'గా మారడంలో మాత్రం ఏటీఎంలకు అత్తెసరు మార్కులే. పెద్దగా చదువుకోనివారూ, కొత్తగా ఉపయోగిస్తున్నవారూ తడబాటుకు గురికాక తప్పదు. తెరమీద అవసరం లేని 'ఆప్షన్స్' అన్నీ కనబడి తెగ చికాకు పెడుతుంటాయి. ఆన్‌లైన్ మహా దుకాణం అమెజాన్‌లో ఏదైనా వస్తువును కొనాలంటే... ఎవరైనా ఏడెనిమిది క్లిక్కులు కొట్టాల్సి వచ్చేది మొదట్లో. రకరకాల పరిశోధనల తర్వాత ఒకటంటే ఒకే క్లిక్కుతో లావాదేవీ పూర్తయిపోయేలా సాంకేతిక పరిజ్ఞానాన్ని మెరుగుపరిచారు ఆ సంస్థ నిపుణులు. దాన్నే 'వన్ క్లిక్ రెవల్యూషన్' అంటారు ముద్దుగా. అదే ఫార్ములాను ఏటీఎంలకూ ఎందుకు అన్వయించకూడదు? నూటికి ఎనభైశాతం మంది డబ్బు తీసుకోడానికే ఏటీఎంకు వెళ్తారు. కానీ, నాలుగైదు తలాతోకాలేని ప్రశ్నల తర్వాతే ఆ ఆప్షన్ అందుబాటులోకి వస్తుంది. దీనివల్ల ఖాతాదారుడి సమయం వృథా కావడం తప్పించి మరో ఉపయోగం లేదు. నిన్నమొన్నటిదాకా ఏటీఎం సేవలు పూర్తిగా ఉచితం. మెల్లమెల్లగా యూజర్ ఛార్జీల బాదుడు మొదలవుతోంది. ప్రతి బ్యాంకూ నాలుగైదు లావాదేవీల్ని మాత్రమే ఉచితంగా అందిస్తోంది. ఆతర్వాత మాత్రం, ప్రతి ఉపసంహరణకూ కొంత మొత్తాన్ని ముక్కుపిండి వసూలు చేస్తోంది. ఏటీఎంలు వచ్చాక బ్యాంకులకు పనిభారం తగ్గింది. నియామకాలూ తగ్గాయి. ఆ మేరకు చాలానే లాభపడుతున్నాయి. ఇది చాలదన్నట్టు, యంత్రాల నిర్వహణ వ్యయాల్ని కూడా జనం ఖాతాల్లో కలిపేయడం అన్యాయం. ఏటీఎంలకే నోరుంటే ఈ మాటే చెప్పేవి.

## ఎంత తేడా!

ఏటీఎం అంటే, కేవలం డబ్బిచ్చే యంత్రమే కాదిప్పుడు. ఇక్కడి నుంచే... బ్యాంకు పాస్‌వర్డు మార్చుకోవచ్చు, చెక్‌బుక్ అభ్యర్థన పంపుకోవచ్చు, బిల్లులూ గట్రా చెల్లించుకోవచ్చు, నగదు బదిలీ చేసుకోవచ్చు. కార్డుతో సంబంధం లేకుండా, ఓ చిన్న ఎస్సెమ్మెస్‌తో డబ్బు డ్రా చేసుకునే వెసులుబాటూ ఉందిప్పుడు. ఏటీఎంలు బ్యాంకు ఆవరణల్ని దాటుకుని... గల్లీలకు వచ్చేశాయి. పల్లెలకూ బయల్దేరాయి. కిరాణా కొట్లలోనూ వెలుస్తున్నాయి.

అత్యాధునిక ఏటీఎంలు అయితే, పదిమంది గుమస్తాలు చేయాల్సిన పనుల్ని ఒంటి చేత్తో చేసేస్తున్నాయి. అక్కడే బ్యాంకు ఖాతా తెరుచుకోవచ్చు. ఆ యంత్రాలే డెబిట్‌కార్డుల్నీ ముద్రించి ఇచ్చేస్తాయి. చెక్కులు జారీ చేసి నగదు కూడా తీసేసుకోవచ్చు. అంటే, కనీసం రెండువేల చదరపు అడుగుల ఆవరణలో జరిగే పనులన్నీ... రెండొందల గజాల్లో పూర్తయిపోతాయి. సాధారణ ఏటీఎంల ధర నాలుగైదు లక్షల మధ్య ఉంటే, వీటి ధర మాత్రం... ముప్పై లక్షల పైమాటే.

పెద్దనోట్ల రద్దు తర్వాత బ్యాంకులు ఏటీఎంల ఏర్పాటులో వేగం తగ్గించాయి. ఏటీఎంల తయారీ సంస్థ ఎన్‌సీఆర్ కార్పొరేషన్ గతంలో ఏడాదికి పాతికవేలకు పైగా యంత్రాలను సరఫరా చేసేదనీ, ప్రస్తుతం అమ్మకాలు పదహారు వేలకు మించడం లేదనీ ఆ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ నవరోజ్ దస్తూర్ ఓ సందర్భంలో అంగీకరించారు కూడా.

'ప్రపంచం మల్టీ టాస్కింగ్ వైపుగా వెళ్తోంది. నాకు ఒకే పని తెలుసు. అది మాత్రమే చేయగలను అంటే సరిపోదు. యంత్రానికి కూడా ఈ పోలిక వర్తిస్తుంది' అంటారు హిటాచి పేమెంట్ సర్వీసెస్‌కు చెందిన లోనీ ఆంథోనీ. ఆ మార్పులో తొలి అడుగుగా... డబ్బును డ్రా చేసుకోడానికి మాత్రమే వీలున్న సాధారణ ఏటీఎంల స్థానంలో చవకైన క్యాష్ రీసైక్లింగ్ మెషీన్స్ (సీఆర్ఎమ్) రాబోతున్నాయి. అంటే, ఒకే యంత్రంలోనే డబ్బు జమ చేయవచ్చూ డ్రా చేసుకోనూ వచ్చు. మన చేతిలోని మొబైల్‌ఫోనే ప్లాస్టిక్ మనీలా పనిచేసే రోజూ ఎంతో దూరంలో లేదు. అప్పుడిక కార్డులతో పన్లేదు. ఏ బ్యాంకు మేనేజరుతోనో మాట్లాడాలనుకుంటే, మీట నొక్కగానే... ఏటీఎంకు బిగించిన తెర మీదే ప్రత్యక్షం అవుతారు. సందేహాలు తీర్చి సమస్యల్ని పరిష్కరిస్తారు. వేలిముద్రలతో సంబంధం లేకుండా.... స్వరాన్ని బట్టో, రూపురేఖల్ని బట్టో ఖాతాదారుల్ని గుర్తించే యంత్రాలూ వచ్చేశాయి. మొత్తంగా ఈ ధోరణికి నిపుణులు పెట్టుకున్న ముద్దుపేరు.... 'బ్యాంక్ ఇన్ బాక్స్'!

అంటే... ఒక్కో డబ్బా,<br>
ఓ బ్యాంకుతో సమానం!<br>
ఎదుర్లేదు నీకు... ఏటీఎం!

**- సండే డెస్క్**












# మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

## స్మార్ట్ కపుల్

"ఈ కాలం పిల్లలే అయినా వంచిన తల ఎత్తకుండా సిగ్గుపడుతున్నారు చూడు" పెళ్లి



పీటల మీదున్న వధూవరుల వైపు చూపిస్తూ పక్కనున్న రామక్కతో అంది సుబ్బక్క.
"దగ్గరకి వెళ్లి చూడు ... ఎవరి స్మార్ట్ ఫోన్‌లో వాళ్లు బిజీగా ఉన్నారు" అసలు విషయం చెప్పింది రామక్క.

## ఏ కార్డు ఎవరి రూపం?

డెబిట్ కార్డు ఫ్రెండ్ షిప్ లాంటిది - ఉన్న దాంతో సర్దు కుందాం మావా అంటుంది.
క్రెడిట్ కార్డు గర్ల్ ఫ్రెండ్ లాంటిది - స్థాయికి మించి జల్సాలకు ఖర్చు పెట్టిస్తుంది.
పాన్ కార్డు పెళ్లాం లాంటిది - సంపాదించే ప్రతి రూపా యీ తనకు తెలియాలంటుంది.

## నీకుందిలే ...



"నిన్న చాలా బాధగా కనిపించావు. ఎంచేత?"
"మా ఆవిడ ఐదువేలు పెట్టి చీర కొనిపించింది"
"అదా సంగతి. మరి ఈరోజు ఇంత హ్యాపీగా ఎలా ఉన్నావు?"
"మా ఆవిడ ఆ చీర కట్టుకుని మీ ఆవిడని కలవడానికి వెళ్లింది".

## తడబడ్డా .. నిలబడ్డా!

నా జీవితంలో ..
ఎన్ని సార్లు పడ్డానో లెక్కేలేదు.
ఎన్ని దెబ్బలు తగిలాయో లెక్కేలేదు.
ఈ ప్రపంచం నన్ను కనీసం
పూచికపుల్లలా కూడా చూడలేదు.
నన్నసలు లెక్కించలేదు.
పడిన ప్రతిసారీ పకపకా నవ్వింది.
వీడి పని అయిపోయిందని గేలిచేసింది.
అయినా ప్రతిసారీ నన్ను నేను నిభాయించుకుని
అతి కష్టం మీద నా అంతట నేనే లేచి
నా కాళ్లమీద నేను నిలబడి
అందరూ విస్తుపోయేలా
నన్నన్నవారి దిమ్మతిరిగేలా
స్పష్టంగా ఒక మాట అనేవాణ్ని
అదేమిటో తెలుసా ...
"వెయిటర్, ఇంకో పెగ్గు తీసుకురా!"

## బిల్లు చూపిస్తే చాలు

"మూర్ఛ ఎప్పుడొస్తుందిరా?" అడిగింది సైన్స్ టీచర్.
"మా నాన్నగారికైతే మా అమ్మ చీరల బిల్లు చూసినప్పుడల్లా వస్తుందండి" చెప్పాడు బుల్లెబ్బాయి.

## బతికిపోయా దేవుడా!

"ఏమిటి నర్స్ .. రేపు ఆపరేషన్ చేయాల్సిన పేషెంట్ తిరిగి చూడకుండా పారిపోతు న్నాడు?" అడిగాడు డాక్టర్.
"ఆపరేషన్ అయ్యాక ఏం చేస్తారని అడిగాడు. మీ బంధు వులకు అప్పగిస్తామని పొర పాటున అనేశాను సార్" నొచ్చుకుంటూ చెప్పింది నర్సమ్మ.



ఏడేళ్ల క్రితం... తొలి పుస్తకం 'ది ఇమ్మోర్టల్స్ ఆఫ్ మెలూహా' (తెలుగులో మెలూహా మృత్యుంజయులు) రాసినప్పుడు అమిష్ అంటే ఎవరికీ తెలియదు. అదే సిరీస్‌లో 'ది సీక్రెట్ ఆఫ్ ది నాగాస్', 'ది ఓత్ ఆఫ్ ది వాయుపుత్రాస్'లు వెలువడిన తర్వాత పాఠకలోకమంతా అమిష్ వెంట పడింది. 'శివ ట్రయాలజీ' (మూడు పుస్తకాలు కలిపి) పుస్తక ప్రపంచంలో బెస్ట్ సెల్లర్‌గా ప్రకంపనాలు సృష్టించింది. ఆ తర్వాత అమిష్ 'రామాయణం' నేపథ్యంలో పుస్తకాలు రాయడం మొదలెట్టారు. ఈ సిరీస్‌లో మొత్తం ఐదు పుస్తకాలుంటే ఇప్పటిదాకా 'సియాన్ ఆఫ్ ఇక్ష్వాకు (తెలుగులో ఇక్ష్వాకు కుల తిలకుడు) 2015లో విడుదల కాగా, ఇటీవల 'సీత: వారియర్ ఆఫ్ మిథిల' విడుదలయ్యింది. ఫోర్బ్స్ '100 మోస్ట్ ఇన్‌ఫ్లుయెన్షియల్ సెలబ్రిటీస్ ఇన్ ఇండియా' లిస్టులో చోటు దక్కించుకున్న అమిష్ (42) గురించిన ఆసక్తికర విశేషాలివి...







# పురాణాలే పుస్తక రచనకు ప్రేరణ!

ముంబయిలో పుట్టినప్పటికీ ఒడిషాలోని రూర్కెలాలో పెరిగాను. చిన్నప్పుడు నాలో సృజనాత్మకత పెద్దగా ఉండేది కాదు. ఆటలంటే చాలా ఇష్టం. ఎప్పుడు చూసినా ఏదో ఒకటి ఆడుకునేవాణ్ణి. అయితే అమ్మానాన్నలు విపరీతంగా పుస్తకాలు చదివేవారు కాబట్టి ఆ అలవాటు నాక్కూడా అబ్బింది. మా తాతగారు గొప్ప పండితులు. భారతీయ చరిత్ర, సంస్కృతి గురించి ఆయన చక్కగా చెప్పేవారు. ఆయన ద్వారానే పురాణాలు నాకు పరిచయమయ్యాయి. పురాణాలు చదివినా, విన్నా చాలా ఆసక్తిగా ఉండేది. నాకు తెలియకుండానే వాటిలో లీనమైపోయేవాణ్ణి. పురాణాలకు సంబంధించిన సందేహాలన్నింటికీ ఆయన సమాధానాలిచ్చేవారు. కొన్నిసార్లు మా మధ్య సుదీర్ఘ చర్చలు కూడా సాగేవి.

• • •

కోల్‌కతా ఐఐఎమ్ నుంచి బయటకు వచ్చాక బ్యాంకింగ్ సర్వీస్‌లో 14 ఏళ్లపాటు పనిచేశా. 90 దశకం ప్రారంభంలో, ఇప్పటిలా పెద్దగా ఉద్యోగావకాశాల్లేవు. బుర్ర నిండా రంగురంగుల కలలుండేవి కానీ వాటిని నెరవేర్చుకునేందుకు డబ్బు ఉండేది కాదు. 1999లో నా పెళ్లి జరిగింది. అప్పుడు నేను స్టాండర్డ్ చార్టర్డ్ బ్యాంకులో పనిచేస్తున్నా. నా భార్య ప్రీతి కూడా పనిచేసేది. బాంద్రా (ముంబయి)లో బ్యాంకుకు చెందిన చిన్న ఫ్లాట్‌లో ఉండేవాళ్లం. టేబుల్ మీద పేపర్ల కట్టలు, వాటిపై కప్పిన దుప్పటి, బెడ్‌రూమ్‌లో ఒక చాప, బెడ్‌షీట్, వంట గదిలో కొన్ని గిన్నెలు... ఇదీ మా చిన్ని ప్రపంచం. ఇద్దరం సంగీతప్రియులమే కావడంతో 10 వేల రూపాయలు పెట్టి (ఆ రోజుల్లో చాలా ఎక్కువ) ఒక మ్యూజిక్ సిస్టమ్ మాత్రం కొన్నాం. దాని దగ్గరే కూర్చుని ఇష్టమైన పాటలు వింటూ ఆనందించేవాళ్లం. నాకు ఒక కొడుకున్నాడు. వాడి పేరు నీల్. సెలవుల్లోస్తే ఎంచక్కా టూర్లు వేసేవాళ్లం. బ్యాంకులో పనిచేస్తుండగానే మొదటి పుస్తకం 'ది ఇమ్మోర్టల్స్ ఆఫ్ మెలూహా' రాశాను. నేను చాలా ప్రాక్టికల్‌గా ఆలోచిస్తాను. అందుకే ఉద్యోగానికి రాజీనామా చేయకుండానే పుస్తక రచన కొనసాగించాను. రెండో పుస్తకం 'ది సీక్రెట్ ఆఫ్ ది నాగాస్' రాసిన తర్వాతే పుస్తకాల మీద వచ్చే ఆదాయంతో బతకవచ్చనే నమ్మకం కలిగింది. ఉద్యోగానికి రాజీనామా చేశాను.

• • •

'శివ ట్రయాలజీ' రాస్తున్న క్రమంలో నేను శివుడి భక్తుడిగా మారాను. శివ తత్వాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నాను. మన పురాణాల్లో నేర్చుకోవడానికి ఎంతో ఉంది. వాటిలో ఎన్నో అద్భుతమైన కథలున్నాయి. వాటి వెనుక ఉన్న తత్వాన్ని నేను ఈ తరానికి అర్థమయ్యేలా చెప్పే ప్రయత్నం చేస్తున్నా. నా పుస్తకాల ప్రధానోద్దేశం ఇదే.

'మీ పుస్తకాలన్నీ అమిష్ పేరుతోనే ఉంటాయి. ఇంటిపేరు వాడరెందుకని నన్ను చాలామంది అడుగుతుంటారు. నిజానికి నా ఇంటిపేరు కులాన్ని తెలియజేస్తుంది. ఇంటిపేరును బట్టి ఉత్తరాదివారికి నా కులమేంటో సులువుగా తెలిసిపోతుంది. నేను కులవ్యవస్థకు పూర్తిగా వ్యతిరేకిని. పుట్టుకతోనే కులాన్ని అంటగట్టడమనేది సరైనది కాదు. నా నమ్మకాలకు కట్టుబడి ఉండాలంటే కులాన్ని సూచించే ఇంటిపేరును వాడరాదని నిర్ణయించుకున్నా. అందుకే తోకలేవీ లేకుండా అమిష్ పేరుతో రచనలు చేస్తున్నా.

జీవితంలో హోదాగానీ, స్థాయిగానీ, గౌరవంగానీ 'కర్మ'వల్ల వస్తుందే కానీ, పుట్టుక వల్ల రాదు. రామాయణాన్ని రచించిన వాల్మీకి మహర్షి బ్రాహ్మణుడు కాదు. బోయవాడైనప్పటికీ 'కర్మ' వల్ల మహర్షిగా కీర్తించబడ్డాడు. వ్యాసుడు మహాభారతాన్ని రాశారు. అది ఆయన అసలు పేరు కాదు. వ్యాసుడి అసలు పేరు కృష్ణ ద్వైపాయన. మత్స్యకారుల కుటుంబంలో పుట్టారు. అయినప్పటికీ 'మహర్షి' అయ్యారు కదా. ఇది నేను కొత్తగా చెబుతున్నది కాదు భారతీయ తత్వంలోనే కర్మ సిద్ధాంతం ఉంది.

• • •

పురాణాల్లోని ప్రధానాంశం చెడకుండా ఆ కథలనే ఒక్కొక్కరు ఒక్కోలాగా చెప్పడమనేది కొన్ని వేల ఏళ్లుగా ఉన్నదే. రామాయణ, భారతాలు ఎప్పటికప్పుడు మోడ్రనైజ్ అవుతూనే ఉన్నాయి. దాని వల్ల పురాణ ఇతివృత్తానికి ఇబ్బందేం ఉండదు. నేను కూడా అదే సంప్రదాయాన్ని, సంస్కృతిని, విధానాన్ని అనుసరిస్తున్నా. పురాణాలు






- ఉదయం 5 గంటలకు నిద్రలేచి వ్యాయామం పూర్తయిన తర్వాత నాలుగైదు దినపత్రికలు చదువుతా. 9 గంటలకు రాయడం మొదలెడితే కొన్నిసార్లు గంటలపాటూ రాస్తుంటా.
- ఒకేసారి ఐదారు పుస్తకాలు చదివే అలవాటుంది.
- ప్రసిద్ధ దర్శకుడు శేఖర్‌కపూర్ నన్ను భారతదేశపు మొట్టమొదటి 'లిటరరీ పాప్‌స్టార్' అనడం ఆనందాన్నిచ్చింది.
- మొదట్లో నేను నాస్తికుణ్ణి. పుస్తకరచన మొదలెట్టిన తర్వాత నా ఆలోచనల్లో మార్పు వచ్చింది.
- నా భార్య ప్రీతి నా రచనలకు తొలి విమర్శకురాలు. తనకు ఏదైనా నచ్చకుంటే నిర్మోహమాటంగా చెప్పేస్తుంది.

ఇప్పటి తరానికి సులువుగా, సరళంగా అర్థమయ్యేలా రాస్తున్నా. నేను వాటిని అర్థం చేసుకున్న తీరును నాదైన ప్రత్యేక శైలిలో పాఠకులకు అందిస్తున్నా. మారుతున్న విద్యావిధానం వల్ల ప్రపంచ సాహిత్యాన్ని చదువుతున్నాం కానీ ఘనమైన భారతీయ వారసత్వాన్ని చదవడం మర్చిపోతున్నాం. అవి పురాణాలు కావొచ్చు, సైన్స్ కావొచ్చు, చరిత్ర కావొచ్చు. మన పిల్లలకు ఇతిహాసాల గొప్పదనాన్ని చెప్పడంలో విఫలమవుతున్నాం. అందుకే మన విద్యావిధానంలో మార్పు తీసుకురావడానికి ఇదే సరైన సమయం అనిపిస్తుంది.

• • •

పుస్తకాలు రాయగానే సరిపోదు. ఈ రోజుల్లో వాటిని మార్కెట్ చేయడం కూడా తెలియాలి. నా దృష్టిలో ప్రతీ రచయిత ఒక వ్యాపారస్థుడే. పుస్తకాలనేవి నా ప్రొడక్ట్. వేరే రంగాల్లో ఒక ప్రొడక్టును మార్చవచ్చుగానీ, ఒక పుస్తకం రాశానంటే ఆ ప్రొడక్టును మార్చలేను. దాన్ని మార్కెటింగ్ చేసుకోవడంలోనే సక్సెస్ దాగుంది. కెరీర్ ప్రారంభంలో తొలి పుస్తకాన్ని అచ్చులో చూసుకునేందుకు 20 మంది ప్రచురణకర్తల దగ్గరికి వెళ్లాను. వాళ్లు కాపీ చదివి నేను తీసుకున్న టాపిక్ బోరింగ్‌గా ఉందన్నారు. పురాణాల గురించి ఈ తరానికి పెద్దగా ఆసక్తి ఉండదన్నారు. అంత జ్ఞానం జనానికి అవసరం లేదన్నారు. అయితే పురాణాల్లోని ఫిలాసఫీని ఈ తరానికి మోడ్రన్‌గా చెబితే తప్పకుండా ఆదరిస్తారనే నమ్మకం నాకుండేది. అందుకే మరో మార్గం లేక నేనే పబ్లిషర్‌గా మారాల్సి వచ్చింది. ఈ క్రమంలో ఇంటర్నెట్ నాకు ఉపయోగపడింది. ఇంటర్నెట్‌లో ఒక చాప్టర్‌ను డౌన్‌లోడ్ చేసుకునేలా అందుబాటులో ఉంచాను. పుస్తకాల షాపుల్లో కూడా ప్రింట్ చేసిన ఒక చాప్టర్‌ను పాఠకులు ఉచితంగా చదివే వెసులుబాటు కల్పించాను. దాంతో పుస్తకంలో విషయం ఉందనే సంగతి వారికి అర్థమైంది. కాబట్టే, 'శివ ట్రయాలజీ'తో పాటు 'ఇక్ష్వాకు కుల తిలకుడు' (సియాన్ ఆఫ్ ఇక్ష్వాకు) పుస్తకాలు సుమారు 40 లక్షల కాపీలు అమ్ముడయ్యాయి. మార్కెట్లో వీటి రిటైల్ సేల్స్ విలువ 100 కోట్ల రూపాయలు. ఇరవైకి పైగా దేశీ, విదేశీ భాషల్లోకి అనువాదం అయ్యాయి కూడా.

పుస్తకం రాయడం పూర్తికాగానే దాన్ని ప్రమోట్ చేసేందుకు నా దగ్గర, నా టీమ్ దగ్గర రకరకాల ప్రణాళికలుంటాయి. పుస్తకం బ్రాండింగ్, ప్రమోషన్ విషయంలో నా టీమ్‌కు తిరుగులేదు. 'శివ ట్రయాలజీ'ని సినిమాగా తీసేందుకు ధర్మ ప్రొడక్షన్స్‌తో ఒప్పందం కూడా కుదుర్చుకున్నాం.

చిన్నతనంలో మా అమ్మ నాతో ఒక మాట అనేది- 'నీ జీవితానికి పరమార్థాన్ని వెతుక్కో. ఫలితం గురించి ఆలోచించకుండా పనిచేసుకుంటూ వెళ్లు. అందులోనే నీకు ఆనందం లభిస్తుంది. అప్పుడు విజయం, అపజయం అనేవి లెక్కలోకే రావు. అలాంటి స్థితి ఉన్నప్పుడే విజయం వస్తే విర్రవీగడం, అపజయం వస్తే కుంగిపోవడం వంటివి అల్పంగా కనిపిస్తాయి'. ప్రస్తుతం నేను అలాంటి స్థితిలోనే ఉన్నాను. 'రామ్‌చంద్ర' సిరీస్‌లో మిగతా పుస్తకాలు రాసే పనిలో బిజీగా ఉన్నా. ✻

A M I S H








క్రైమ్ స్టోరీ

# అడుగేస్తే భౌ!

**మార్చురీలో మృతదేహాన్ని పరిశీలనగా చూస్తున్నాడు తన్మయ్ బిశ్వాస్.**

**తల ఛిద్రమై మొహమంతా రక్తం గడ్డకట్టుకుపోయింది. కళ్లు తెరుచుకునే ఉన్నాయి. ఘటన తాలూకు దిగ్భ్రాంతి అంతా ఆ కళ్లలో ఘనీభవించినట్టుంది.**

**"కళ్లల్లో ఆ షాక్ చూస్తే సడన్ అటాక్‌లా ఉంది. వెపన్ దొరికిందా?"**

**లేదన్నాడు కులదీప్‌సింగ్. మృతురాలి భర్తని విచారిస్తున్నామన్నాడు.**

**"జరిగింది సడన్ అటాక్ అయితే కళ్లలో కనిపిస్తున్నది భౌతికపరమైన షాక్. తెలిసినవాడే అటాక్ చేస్తే ఇది మానసికపరమైన షాక్ అనుకోవాలి. రెండిట్లో దేన్ని డిసైడ్ చేస్తే మనకు ఈజీగా ఉంటుంది?"**

**తెలతెలవారుతుండగా షాపు తెరవడానికొచ్చిన యజమానికి అరుగు మీద దుప్పటి కప్పుకుని పడుకున్న ఎవరో కనిపించారు. లెమ్మన్నాడు. లేవలేదు. దుప్పటి లాగేస్తూ గద్దించాడు. దుప్పటి తొలగిన మొహాన్ని చూసి గావుకేక పెట్టి పరుగెత్తాడు.**

**కా**ల్ అందుకుని పీసీఆర్ వ్యాన్ వచ్చింది. పెట్రోలింగ్ సిబ్బంది శవాన్ని చూసి ఆరా తీశారు. సమాచారమందుకుని ఇన్‌స్పెక్టర్ కులదీప్‌సింగ్ వచ్చాడు. అప్పటికే మృతురాలు నర్గీస్ అని తెలిసింది. ఈ వీధిలోనే ఉంటున్న మహమ్మద్ అనీష్ అనే పెయింటర్ భార్య.

దక్షిణ ఢిల్లీ సంగం విహార్ ప్రాంతంలో జరిగిన ఈ సంఘటన గురించి తెలిసి, జనం గుంపుగా చేరారు అనీష్ ఇంటి ముందు. తనకేం తెలియదని పోలీసులకు చెప్తున్నాడు అనీష్. ఇన్‌స్పెక్టర్ కులదీప్ ఇల్లంతా శోధించాడు. "రాత్రి గొడవపడ్డారా? అందుకని బయటికెళ్లి పడుకుందా?" అనడిగాడు. రాత్రి గొడవేం పడలేదనీ, ఎప్పుడు బయటకెళ్లిందో తెలియదనీ పదే పదే చెప్పసాగాడు అనీష్. అతణ్ణి పోలీసుస్టేషన్‌కు తీసుకెళ్లాడు కులదీప్‌సింగ్.

"అయితే ఒకటి ఉంది... శవం మీద దుప్పటి కప్పి ఉంటే ఒక అర్థం. శవాన్ని దుప్పట్లో చుట్టి ఉంటే ఇంకో అర్థం వస్తాయి" మార్చురీ నుంచి బయల్దేరుతూ అన్నాడు అడిషనల్ డిప్యూటీ కమిషనర్ ఆఫ్ పోలీస్ తన్మయ్ బిశ్వాస్.

"దుప్పటి కప్పి ఉంటే మర్డర్ అక్కడే జరిగినట్టు. దుప్పటి చుట్టి ఉంటే ఇంకెక్కడో చంపి తెచ్చి అక్కడ వదిలేసినట్టు. మళ్లీ ఇందులో రెండున్నాయి..."

"ఏమిట్సార్...?"

"శవాన్ని అక్కడ కావాలని వదిలేశాడా, లేకపోతే ఎవర్నో చూసి అక్కడ పడేసి జారుకున్నాడా?"

"కనుక్కుంటా సార్..."

సంగం విహార్‌లో శవాన్ని కనుగొన్న ఆ వీధిలో మూడు ఊరకుక్కలు అటూ ఇటూ తిరుగుతున్నాయి.

పోలీస్‌స్టేషన్‌లో అనీష్‌ని ఇంకా తీవ్రంగా ప్రశ్నిస్తున్నాడు కులదీప్.

"అయితే దేంతో కొట్టావో చెప్పవన్నమాట?"

"నేనెందుకు కొడతాన్సార్... కొట్టలేదు..."

"మరెవరి మీద నీకనుమానం..."

"ఎవరి మీదా లేదు"

"నువ్వుగాక ఆమెకి ఇంకో మగాడు తెలుసా...?"

"ఏం సాబ్ అట్లా మాట్లాడుతున్నారు... తెలీదు..."

"తెలిసి ఉంటాడు"

"తెలీదు... అలాంటిది కాదు"

"అవును, నీ భార్య అలాంటిది కాదు. ముగ్గురు పిల్లలున్నారు. నిన్నూ పిల్లల్నీ ప్రేమగా చూసుకుంటుంది. దేనికీ నీతో గొడవపడదు"

"ఏమంటున్నారు సాబ్. ఏమంటున్నారు మీరు. అది అలాంటిది కాదా? దాన్ని చూసి నేను గర్వపడాలా? అదలాంటిదే. దానికొకడున్నాడు. వాడితో తిరుగుతోంది"

"తప్పు భయ్యా"

"తప్పు కాదు సాబ్, నిజం"

"అయితే ఇక్కడ సంతకం పెట్టు" అని రైటర్ దగ్గర నుంచి స్టేట్‌మెంట్ పేపర్స్ లాక్కుని అనీష్ ముందు పెట్టాడు కులదీప్. తనని ఇలా ఇరికించేసిన కులదీప్‌ని నోరెళ్లబెట్టి చూడసాగాడు అనీష్.

ఆ వీధిలో ఊరకుక్కలు దేనికోసమో అన్నట్టు అటూఇటూ తిరుగుతున్నాయి. ఉండుండి ఆ షాపు ముందు నిలబడి అరుస్తున్నాయి.

అవి రాత్రంతా కాపలా కాశాయి. వాటికి రాత్రి ఒంటిగంటకి పెయింటర్ అనీష్ తనింట్లో భార్యతో గొడవపడ్డాడని తెలీదు. ఆమె మీద అనుమానంతో కొట్టి, కసి తీరక, ఇనపకడ్డీతో దాడిచేసి- పదేపదే తల పగులగొట్టి చంపేశాడని కూడా వాటికి తెలీదు. అవి మామూలుగా వీధిలో తిరుగుతున్నాయి. ఇంతలో దుప్పట్లో చుట్టిన భార్య శవాన్ని భుజానేసుకుని వచ్చిన అనీష్‌ని కూడా అవి చూడలేదు. అటు కాస్త దూరం వెళ్తే అటవీ ప్రాంతం ఉంటుంది. శవంతో అక్కడికి ప్రయాణం కట్టాడని కూడా వాటికి తెలీదు. శవాన్ని అడవిలో వదిలించుకుని వచ్చేయాలనుకున్నాడని కూడా అవి ఊహించలేదు. గబగబా శవంతో వెళ్తున్నప్పుడు అవి పసిగట్టాయి- నట్టనడి రాత్రి ఏదో గూడుపుఠాణీ జరుగుతోందని!




అంతే... భౌ భౌమంటూ లంఘించాయి.

నడిరాత్రి వాటి అరుపులు దిక్కులు పిక్కటిల్లేలా ఉన్నాయి. శవంతో స్థాణువై నిలబడ్డ అనీష్ మొహంలో కుతంత్రమంతా అవి లైటు కాంతిలో చదివేస్తున్నాయి. కదిల్తే మీదికొస్తున్నాయి. అదిలిస్తే మొరుగుతున్నాయి. అడుగు ముందుకేస్తే భౌ మంటూ పళ్లు చూపిస్తున్నాయి. క్షణాలు గడిచిపోతున్నాయి. ఎవరైనా వీధిలోకి రావొచ్చు. ఎవరైనా వాటి అరుపులకు లేచి రావొచ్చు. అవి మాత్రం కదిలే ప్రసక్తి లేకుండా అక్కడే కూర్చున్నాయి.

విధిలేక అనీష్ శవాన్ని షాపు అరుగు మీద పడుకోబెడుతుంటే మౌనంగా చూశాయి. అతడు తిరుగుముఖం పడుతుంటే నిశ్శబ్దంగా గమనించాయి. కాసేపటికి లేచి మృతదేహం దగ్గరికెళ్లాయి. చుట్టూ తిరుగుతూ వాసన చూసి అక్కడే పడుకున్నాయి.

తెలతెలవారుతుండగా ఏమనిపించిందో, లేచి వెళ్లిపోయాయి. ఎప్పుడో పొద్దెక్కాక వచ్చి చూస్తే తాము కాపలా ఉన్న శవం కన్పించడం లేదు. ఏమీ అర్థంగాక వీధిలో అటూ ఇటూ తిరుగుతున్నాయి. అప్పుడప్పుడు షాపు ముందుకొచ్చి అరుస్తున్నాయి.

ఇదంతా పోలీస్‌స్టేషన్లో అనీష్ చెప్పేస్తున్నాడని వాటికి తెలీదు.

అవి న్యాయం కోసం ఎదురుచూస్తున్నాయి.

● సికిందర్

పబ్లిసిటీ కొత్త పుంతలు తొక్కుతోంది. సాధారణంగా ఏదైనా వస్తువును మార్కెట్లోకి ప్రవేశపెట్టి, కస్టమర్లను ఆకట్టుకోవాలంటే ఏ సినిమాస్టార్‌నో, క్రికెట్‌స్టార్‌నో మోడల్‌గా తీసుకుని... వారికి కోట్ల రూపాయల్లో పారితోషికం ఇచ్చి ప్రచారం చేసేవారు. కానీ లేటెస్ట్‌గా సోషల్ మీడియా కోడై కూస్తుండటంతో కార్ల కంపెనీలు సరికొత్త ప్రచారానికి తెరలేపాయి. సెలబ్రిటీలకు భారీ డిస్కౌంట్ల వల విసురుతున్నాయి.

# 'స్టార్' డిస్కౌంట్!



'కస్టమర్లయందు సెలబ్రిటీ కస్టమర్లు వేరయా' అంటున్నాయి కార్ల కంపెనీలు. అవును... ఒక కామన్‌మ్యాన్‌కు కారు అమ్మితే 5 శాతానికి మించి డిస్కౌంట్ ఇవ్వని కార్ల కంపెనీలు సెలబ్రిటీ కస్టమర్లకు మాత్రం ఎన్నడూ ఊహించనంతగా డిస్కౌంట్లను ఇస్తున్నాయి. ఒక క్రికెటరో, సినిమాస్టారో తమ బ్రాండ్ కారు కొంటే... ఆ కారు మీద ఆయా సెలబ్రిటీల రేంజ్‌ను బట్టి 30 శాతం నుంచి 40 శాతం దాకా ... ఒక్కోసారి 60 శాతం కూడా డిస్కౌంటు ఇస్తున్నాయి. టీవీ స్టార్లు, జూనియర్ క్రికెటర్లకు లగ్జరీ కార్లపై 20 శాతం డిస్కౌంట్ ఇస్తే, సినిమా స్టార్లకు, క్రికెట్ స్టార్లకు 50 నుంచి 60 శాతం వరకు ధర తగ్గిస్తున్నట్టు వినికిడి.

**ఎందుకిలా...?**

సాధారణంగా కొత్త కారు కొన్న తర్వాత సెలబ్రిటీలు ఆ వార్తను (ఫొటోతో సహా) ట్విట్టర్లోనో, ఇన్‌స్టాగ్రామ్‌లోనో, ఫేస్‌బుక్‌లోనో పెడుతున్నారు. సోషల్ మీడియాలో వారిని కొన్ని కోట్ల మంది ఫాలో అవుతుంటారు కాబట్టి సదరు కారుకు వాళ్ల అనధికారికంగా బ్రాండ్ అంబాసిడర్‌గా పనిచేస్తున్నట్లే. అంతేగాక వారి వారి సర్కిళ్లలో సహచరులు, సన్నిహితులు కూడా ప్రభావితమవుతారు. సోషల్ మీడియాలో ఈ లేటెస్ట్ ట్రెండ్ కార్ల కంపెనీలకు బాగా కలిసివస్తోంది.

లగ్జరీ కార్లకు కోట్లు కుమ్మరించి ప్రకటనలు ఇచ్చే బదులు, వాటిని సోషల్ మీడియాలో ప్రమోట్ చేసే సెలబ్రిటీలకే, వారి వారి రేంజ్‌ను బట్టి డిస్కౌంట్ ఇస్తే బాగా వర్కవుట్ అవుతుందని కంపెనీలు భావిస్తున్నాయి. అందుకే వారికి బెస్ట్ డీల్స్‌ను అందిస్తున్నాయి. దీనివల్ల ఆయా బ్రాండెడ్ కార్లు టార్గెట్ కస్టమర్లకు సులువుగా దగ్గరవుతాయని మార్కెటింగ్ నిపుణులు అంటున్నారు.





సెలబ్రిటీలకు డిస్కౌంట్ ధరలకు అమ్మడం వల్ల ఇంకో లాభం కూడా ఉంది. అదేమిటంటే కారు తాళాల్ని వారికి స్వయంగా అందించే కార్యక్రమం ఆటోమేటిగ్గా ఒక వేడుకగా మారుతోంది. షోరూమ్‌కు సెలబ్రిటీ వచ్చి స్వయంగా డెలివరీ తీసుకోవడం వల్ల మీడియాలో ఉచిత ప్రచారం లభిస్తోంది.



కొన్ని కార్ల కంపెనీలు సెలబ్రిటీలకు రెండు మూడు నెలల పాటు 'డెమో కార్ల'ను ఇస్తున్నాయి. అంటే ఒక కొత్త మోడల్ కారు టెస్ట్ డ్రైవింగ్ పేరిట వారి దగ్గరే ఉంటుందన్నమాట. ఆ తర్వాత సెలబ్రిటీలకు ఆ కారు నచ్చితే, దాన్ని 'యూజ్డ్ కారు' ధరకే ఇచ్చేస్తున్నారు. ఇదంతా ప్రచారంలో భాగమే సుమా. ఈ వ్యవహారమంతా ఫార్మల్ అగ్రిమెంట్ రూపంలోనే జరుగుతుంది. సోషల్ మీడియాలో స్టార్లు తమ బ్రాండ్ కార్లకు ఎంత ఎక్కువ ప్రమోషన్ చేస్తే అంతగా డిస్కౌంట్లను ఆఫర్ చేస్తున్నాయి కార్ల కంపెనీలు. అంతేకాదు... సెలబ్రిటీలు వాడిన కార్లను 'ఎక్స్ఛేంజ్ ఆఫర్‌లో మార్కెట్ ధర కన్నా ఎక్కువ ఇచ్చి కొనుగోలు చేస్తున్నారు వీరాభిమానులు. కామన్ కస్టమర్ల సంగతెలా ఉన్నా... ప్రస్తుతం ఈ కొత్తరకం ట్రెండ్‌తో సెలబ్రిటీలు మాత్రం పండగ చేసుకుంటున్నారు. ❇










# అనుభూతుల తీరం గోల్డ్ కోస్ట్!

**అక్కడ డాల్ఫిన్ విన్యాసాల్ని చూడాల్సిందే. 'సెవెన్టీ 7' చివరి అంతస్తులో నిలబడి ప్రకృతి అందాల్ని తిలకించాల్సిందే. బ్రిస్బేన్ నగర సౌందర్యానికి ముగ్ధులు కావాల్సిందే. అత్యంత ఎత్తయిన ఎక్స్టర్నల్ వాకింగ్‌ను అనుభూతించాల్సిందే. టాంబోర్లిన్ అభయారణ్యాన్ని పలకరించాల్సిందే. ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్ రాష్ట్రంలో ఉన్న గోల్డ్ కోస్ట్ వెళ్లి తీరాల్సిన ఓ విహార కేంద్రం. సకుటుంబ ప్రయాణానికి మీరూ ఏర్పాట్లు చేసుకోండి.**

నేలా... నీరూ... ఆకాశం! ప్రకృతి ఒడిలో పరవశం! ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్ రాష్ట్రంలో ఉన్న గోల్డ్‌కోస్ట్ గురించి చెప్పేందుకు ఈ మూడు ముక్కలు చాలు!

ఒకవైపు నీలి సముద్రపు అలల సవ్వడి! తీరాన్ని ఆనుకునే నిటారుగా లేచి... ఆకాశాన్ని అంటే హర్మ్యాలు! 'నీటి నగల' నడుమ వెలిసిన భవంతులు! నగరం నుంచి కొంచెం దూరం వస్తే... పచ్చటి పొలాలు, దట్టమైన అడవులు! ఆస్ట్రేలియాకు ప్రకృతి అందించిన వరం గోల్డ్ కోస్ట్! ఇంత అందమైన ప్రాంతంలో పర్యటించే అవకాశం స్కూట్ టైగర్ ఎయిర్ - క్వీన్స్‌ల్యాండ్ టూరిజం ద్వారా కలిగింది. సింగపూర్ మీదుగా గోల్డ్ కోస్ట్‌కు ప్రయాణం! టైగర్ ఎయిర్‌లో హైదరాబాద్ నుంచి సింగపూర్‌కు... అక్కడి నుంచి స్కూట్ ఫ్లైట్‌లో గోల్డ్ కోస్ట్‌కు చేరుకున్నాం. మొత్తంగా 11 గంటల ప్రయాణం! విమానంలో నుంచి చూస్తున్నప్పుడే గోల్డ్‌కోస్ట్ అందాలు మనసు దోచేస్తాయి. ఎప్పుడెప్పుడు నేలపై వాలి వాటిని ఆస్వాదించాలా అనే ఆసక్తి మొదలవుతుంది. మొదటిరోజు రివర్ క్రూయిజ్‌తో మా పర్యటన మొదలైంది. నదిలో, సముద్రపు బ్యాక్ వాటర్‌లో ప్రశాంతంగా జరిగే నౌకా విహారం! నీలిరంగు నీటిపై సాగే నౌక డెక్‌పై నుంచి గోల్డ్ కోస్ట్‌లో నింగినంటే భవంతులను చూస్తూ సాగడం మంచి అనుభూతిని మిగులుస్తుంది. చిరు చల్లటి గాలి ముఖాన్ని తాకుతూ మరింత హాయి గొలిపింది. ఆ తర్వాత... అదే నీటిలో 'జెట్ స్కీ' బోటింగ్ చేశాం. క్రూయిజ్ కూల్‌కూల్‌గా సాగితే... జెట్ స్కీ బోట్ అలల కల్లోలం సృష్టిస్తూ దూసుకెళుతుంది. అటు ఇటూ తిప్పేస్తూ, కుదిపేస్తూ... బోటును వృత్తాకారంలో గిరికీలు కొట్టిస్తుంటే కేకలు వేయకుండా ఆగలేం. తీరం వైపున అడవుల్లోంచి బయటికి వచ్చిన కంగారూలు కూడా మాకు దర్శనమిచ్చాయి. 'పర్యాటకులను రంజింప చేయడానికి కాదేదీ అనర్హం' అన్నట్లుగా... సేవలు విరమించిన అగ్నిమాపక యంత్రాలనూ ఇక్కడ టూరిస్టుల కోసం వాడుతుండటం విశేషం. 'ఫైర్ ఫర్ హైర్' పేరిట తిరిగే ఈ వాహనాల్లో మనమే అగ్నిమాపక సిబ్బంది అవతారం ఎత్తవచ్చు. నిప్పులు ఉండవు కానీ... ఓ పచ్చిక మైదానంలోకి తీసుకెళ్లి మనతోనే నీళ్లు చిమ్మిస్తారు.

### డాల్ఫిన్ విన్యాసాలు... సీల్ వేషాలు

సీ వరల్డ్ రిసార్ట్... పేరులో ఉన్నట్లే ఇది సముద్ర జీవులకు ఆలవాలం! ఇక్కడి డాల్ఫిన్ షో ఇక్కడ ఆబాల గోపాలంతో కేరింతలు కొట్టిస్తుంది. శిక్షకులు ఇచ్చే సంకేతాలను అందుకుని డాల్ఫిన్లు రివ్వున గాలిలోకి ఎగరడం, పల్టీలు కొట్టడం, ఒడ్డుదాకా వచ్చి వింతగా తోకలు ఊపడం వంటి విన్యాసాలు చూసి 'వారెవ్వా' అనాల్సిందే. అదే రిసార్ట్‌లో సీల్ వేసిన వేషాలు చూసి మరింత ఆశ్చర్యపోయాం. 'ఫిష్ డిటెక్టివ్' పేరిట ప్రదర్శించిన నాటకంలో సీల్‌ది ఒక ప్రధాన పాత్ర. మనుషులతో పాటు సీల్ కూడా 'యాక్షన్' చేయడం... రకరకాల శబ్దాలతో డైలాగులూ చెప్పడం చిత్రంగా అనిపించింది. సీ వరల్డ్ రిసార్ట్‌లో కృత్రిమ సరస్సుల్లో షార్క్‌లు, స్టింగ్ రేలతోపాటు అనేక అరుదైన సముద్ర జీవులను ప్రత్యక్షంగా చూడవచ్చు. ధ్రువపు ప్రాంతాల్లో మాత్రమే కనిపించే ధ్రువపు ఎలుగుబంటి, పెంగ్విన్‌లూ ఇక్కడ ప్రత్యేకమే! ఇక... పిల్లలకోసం రకరకాల రైడ్స్, భారీ రోలర్ కోస్టర్ కూడా ఉన్నాయి. సముద్ర జీవులపై పరిశోధన, సంరక్షణలోనూ సీవరల్డ్ రిసార్ట్ నిమగ్నమైంది. అన్నట్లు... ఈ రిసార్ట్ జనరల్ మేనేజర్ మన భారతీయుడే. పేరు... ప్రకాశ్!

### నింగిని తాకుతూ నడక

గోల్డ్‌కోస్ట్‌లోని అనేక ఆకాశ హర్మ్యాల్లో ఒకటి... క్యూ1 బిల్డింగ్. ఇది 77 అంతస్తుల భవనం. క్షణంలో రెండు అంతస్తులు అధిగమించే... ఆస్ట్రేలియాలోనే రెండో అత్యంత వేగవంతమైన లిఫ్టులు ఇక్కడున్నాయి. వెరసి... అర నిమిషంలోనే 77వ అంతస్తుకు చేరుకుంటాం. అక్కడ 'సెవెన్టీ 7' పేరుతో



చక్కటి హోటల్! అక్కడి నుంచి మొత్తం గోల్డ్ కోస్ట్ అందాలను అద్దాల వెనుక నుంచి చూస్తుంటే థ్రిల్లింగ్‌గా అనిపిస్తుంది. అసలు విషయం ఇక్కడితో ఆగిపోలేదు. మరింత పైకి వెళ్లవచ్చు. అక్కడే అసలైన మజా మొదలవుతుంది. ఈసారి ఎలాంటి లిఫ్ట్ ఉండదు. మెట్లు ఎక్కాల్సిందే. అది కూడా బిల్డింగ్ బయటి వైపు నుంచి... ఎలాంటి గోడలు అడ్డు లేకుండా నడక! మన ఎడమ వైపు మాత్రమే పట్టుకునేందుకు ఆధారం ఉంటుంది. కుడి వైపున అంతా ఓపెన్! కిందికి తొంగి చూస్తే మనుషులు చీమల్లా కనిపించేంత ఎత్తు! దీనినే 'స్కై వాక్' అని పిలుస్తారు. స్కైవాక్ చేసే వారికి పూర్తిస్థాయి భద్రత కల్పిస్తారు. ప్రత్యేకమైన సూట్ ధరించాలి. భుజాల నుంచి మోకాళ్ల వరకు ఉండే రక్షణ కవచం... దాని బెల్ట్‌ను రెయిలింగ్‌కు అనుసంధానిస్తారు. అలా ముందుకు కదులుతూ... 124 మెట్లు ఎక్కి... పైపైన ఉండే డెక్ వరకు చేరుకోవచ్చు. 270 మీటర్ల ఎత్తు నుంచి గోల్డ్ కోస్ట్ అందాలు పరిపూర్ణంగా ఆస్వాదించవచ్చు. తెల్లటి నురగలను చిమ్ముకుంటూ వచ్చే అలలు... ఆ అలలతో వాటుతోపాటు కదిలే సర్ఫర్స్... హంసల్లా కదిలే పడవలు... ఇలా అన్నీ 'మినియేచర్‌'ల మాదిరి గమ్మత్తుగా కనిపిస్తాయి. మహామహా ఎత్తైన భవనాలు సైతం మన ముందు చిన్నబోయినట్లుంటాయి. అక్కడి నుంచి 80 కిలోమీటర్ల దూరంలో ఉండే బ్రిస్బేన్ నగరం కూడా కనిపిస్తుంది. ఇది ఆస్ట్రేలియాలోనే అత్యంత ఎత్తైన 'ఎక్స్టర్నల్





గోల్డ్‌కోస్ట్‌లో వ్యాస రచయిత



వాకింగ్ కావడం విశేషం.

**గాలితో... గాలిలోకి!**

గోల్డ్ కోస్ట్ అంటే సముద్రం ఒక్కటే కాదు! పచ్చిక బయళ్లు, బొమ్మరిళ్లలాంటి ఇళ్లున్న పల్లెలు కూడా! నింగిలో ఎగురుతూ చూస్తే వీటి అందం మరింత ఆకట్టుకుంటుంది. అందుకు మనముందున్న మార్గం హాట్ ఎయిర్ బెలూన్! భారీ బెలూన్‌లోకి వేడిగాలి నింపి... గాలివాటుగా సాగిపోయే ప్రయాణమిది! దీనికోసం మేం తెల్లవారుజామున 4.30 గంటలకే సిద్ధమయ్యాం. ఉదయం పూట మాత్రమే వాయు ప్రవాహం నెమ్మదిగా ఉంటుంది. మా హాట్ ఎయిర్ బెలూన్ నడిపిన వారిద్దరూ స్పెయిన్ జాతీయులు. బెలూన్ బాస్కెట్‌లో మొత్తం 24 మంది పర్యాటకులకు చోటు ఉంటుంది. బెలూన్‌లో నిండిన గాలి పరిమాణం, బయటి నుంచి గాలి వీస్తున్న దశ, మనం ఎక్కడున్నాం ఇలాంటివన్నీ తెలిపే వ్యవస్థ అక్కడ ఉంది. వాకీ టాకీల సహాయంతో కిందున్న సిబ్బందితో ఎప్పటికప్పుడు మాట్లాడుతూ తామెక్కడున్నది చెబుతూ ఉంటారు. అలా.... అలా... చప్పుడు చేయకుండా 'గాలి విమానం' నింగిలోకి ఎగిరింది. వ్యవసాయ క్షేత్రాలు, అక్కడొక్కటి అక్కడొకటిగా ఉన్న ఇళ్లు, విశాలమైన ప్రాంగణాల్లో పరుగులు తీస్తున్న గుర్రాలు, చెట్లూ, నీటి కుంటల మీదుగా బెలూన్ కదిలింది. హాట్ ఎయిర్ బెలూన్ నుంచే సూర్యోదయ దృశ్యాన్ని కూడా ఆస్వాదించాం. ఆ తర్వాత ఓరిల్లీ వైన్‌యార్డ్‌లో బ్రేక్‌ఫాస్ట్. ఆస్ట్రేలియాలో వైన్ తయారీ కేంద్రాల్లో క్వీన్స్‌లాండ్ ఒక్కటి. ఓరిల్లీ కూడా ఒక బ్రాండ్. అదంతా వదిలేస్తే... పచ్చటి మైదానం మధ్యలో పాతకాలపు అందమైన, పెద్ద పెంకుటిల్లు, దాని వెనుక పారుతున్న చిన్న నది, ముందువైపు కొండలు, ద్రాక్ష తోట! ఇదీ ఓరిల్లీ దృశ్యం. ఇది అచ్చంగా ప్రకృతి వేసిన పెయింటింగ్‌లా అనిపించింది.

**జిప్...జిప్...మంటూ!**

గోల్డ్‌కోస్ట్ నగరానికి 40 కిలోమీటర్ల దూరంలో మౌంట్ టాంబోర్లిన్ అభయారణ్యం ఉంది. అక్కడ మేం ఓ మోస్తరు సాహసం చేశాం. అదే... జిప్ లైనింగ్. మధ్యలో చిన్న సెలయేరు పారే లోయ... అటూ ఇటు పెద్ద చెట్లను కలుపుతూ బలమైన తీగ! ఆ తీగకు కప్పీ వేసుకుని... ఇటు వైపు నుంచి అటువైపునకు రయ్యమని జారిపోవడమే! ఇదే జిప్ లైన్. ఈ చివర ఒక్కసారి కదిలితే చాలు... మన ప్రమేయం లేకుండానే అటువైపునకు వెళ్లిపోతాం! అది కూడా... నేలకు 60 మీటర్ల ఎత్తున... గంటకు 70 కిలోమీటర్ల వేగంతో. మొత్తం నాలుగు అంచెల్లో 1.5 కిలోమీటర్ల జిప్‌లైన్ ప్రయాణం చేశాం. జిప్‌లైనింగ్ గుండెను జివ్వుమనిపించింది. టాంబోర్లిన్‌లోనే 'మసాలా శాంతి' పేరిట మన భారతీయ జంట చక్కటి రెస్టారెంట్ నడుపుతున్నారు. మధ్యాహ్నం మా భోజనం అక్కడే! స్థానికుల సపోర్ట్ తమకు ఎంతో ఉందని వారు తెలిపారు. అక్కడే కళాకృతులు, దుస్తులు అమ్మే షాప్స్ చాలా ఉన్నాయి. ఆ షాపులన్నింటినీ చూడ చక్కగా తీర్చిదిద్దారు.

**చూడాలంటే చాలా ఉంది...**

ఆస్ట్రేలియా పెద్ద 'ఖండ - దేశం'. అందులో... క్వీన్స్‌లాండ్ ఒకటి. అందులో గోల్డ్‌కోస్ట్ ప్రఖ్యాత పర్యాటక ప్రాంతం. గోల్డ్ కోస్ట్ గురించి అంకెల్లో చెప్పాలంటే... ఇక్కడ 260 కిలోమీటర్ల పొడవునా జల రహదారులున్నాయి. లక్ష హెక్టార్ల అరణ్యం, 18 సర్ఫింగ్ ప్రదేశాలు, 365 రకాల వినోద విన్యాసాలు, 500 రెస్టారెంట్లు ఉన్నాయి. అంతేకాదు... పగడపు దిబ్బలకు క్వీన్స్ ల్యాండ్ ఎంతో ప్రసిద్ధి! మేం అచ్చంగా నాలుగు రోజులు ఇక్కడే ఉన్నా... చూడగలిగింది కొంతే! మొత్తం క్వీన్స్‌ల్యాండ్‌ను చూడాలంటే కనీసం వారం పడుతుంది! క్వీన్స్‌ల్యాండ్‌కు ఏటేటా పర్యాటకుల సంఖ్య పెరుగుతూనే ఉంది. విదేశీ పర్యాటకుల్లో చైనీయులదే అగ్రస్థానం. ఆ తర్వాతి వాటా భారతీయులదే! భారత్ నుంచి క్వీన్స్‌లాండ్ వచ్చే వారి సంఖ్య ఐదేళ్లలో 20 శాతం పెరిగిందని అక్కడి టూర్ ఆపరేటర్లు ఆనందంగా చెప్పారు. మాకున్న నాలుగు రోజుల్లోనే వీలైనంతగా గోల్డ్‌కోస్ట్ అందాలను ఆస్వాదించాం. ఇండియన్ రెస్టారెంట్ ప్రశాంతమైన వాతావరణంలో మన భోజనం నుంచి 'డ్రాక్యులాస్' నైట్‌క్లబ్‌లో చెవులు చిల్లులు పడే సంగీతం మధ్య డిన్నర్ దాకా రకరకాల అనుభూతులు! ఈసారి ఫారిన్‌లో వెకేషన్ ప్లాన్ చేయాలనుకుంటున్న వారు క్వీన్స్‌ల్యాండ్‌ను ఎంచుకోవచ్చు!

**- తొమ్మండ్రు సురేష్ కుమార్.**

# టీనేజీ... వ్యాపారంలో బిజీ!

'సిమ్‌కార్డు చూడ్డానికి చిన్నగానే ఉంటుంది. కానీ సిగ్నల్ మాత్రం యూనివర్సల్‌గా ఉంటుంది' అంటాడు బ్రహ్మీ అదేదో సినిమాలో! ఆ పోలిక టీనేజ్ ఎంట్రప్రెన్యూర్స్‌కూ వర్తిస్తుంది. బడికెళ్లాల్సిన వయసులో బోర్డు మీటింగ్‌లకు హాజరు అవుతారు. హోమ్‌వర్కు చేసుకోవాల్సిన సమయంలో ప్రాజెక్టు రిపోర్టులు సిద్ధం చేసుకుంటాడు. ఫైవ్‌స్టార్ చాక్లెట్లకే మురిసిపోవాల్సినవాళ్లు... ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో బస చేస్తారు. ఓ ఐదారుగురు పిట్టకొంచెం కూతఘనం ఎంట్రప్రెన్యూర్స్‌తో పరిచయం...

## లక్ష్మీ బాంబ్!

'యంగెస్ట్ గర్ల్ వెబ్ డిజైనర్ ఆఫ్ ది వరల్డ్', 'యంగెస్ట్ సీఈవో ఆఫ్ ది వరల్డ్'... ఎనిమిదేళ్ల వయసులో సరదాగా నేర్చుకున్న వెబ్‌డిజైనింగ్ కోర్సే శ్రీలక్ష్మి సురేష్‌కు ఇన్ని అవార్డులు తెచ్చిపెట్టింది. నాలుగో తరగతిలో ఉన్నప్పుడు, తాను చదివే పాఠశాలకు ఓ వెబ్‌సైట్‌ను తయారుచేసి ఇచ్చింది శ్రీలక్ష్మి. అదో ప్రపంచ రికార్డుగా నమోదైంది. "నేను స్కూల్ కోసం రూపొందించిన వెబ్‌సైట్ పెద్ద హిట్ అయ్యింది. మాకోసం కూడా ఒక వెబ్‌సైట్ చేసివ్వవూ... ప్లీజ్' అంటూ చాలా కంపెనీల నుంచి విజ్ఞప్తులు వచ్చాయి. కాదనలేక పోయాను. పదకొండేళ్ల వయసులో 'ఈడిజైన్ టెక్నాలజీస్' అనే సంస్థను ప్రారంభించాను. ప్రస్తుతం రెండొందల యాభైకి పైగా వెబ్‌సైట్లను మేం నిర్వహిస్తున్నాం" అని చెబుతోంది శ్రీలక్ష్మి. తను ప్రస్తుతం సెయింట్ జోసఫ్ కళాశాలలో బీబీఏ చివరి సంవత్సరం చదువుతోంది. కేరళ పర్యాటక విశేషాలను తెలిపే స్టేట్ఆఫ్‌కేరళ.ఇన్‌తో పాటు బార్ కౌన్సిల్ ఆఫ్ కేరళ, ఏంజెల్స్ ఇంటర్నేషనల్ వంటి ఎన్నో పెద్ద సంస్థల వెబ్‌సైట్స్ శ్రీలక్ష్మి రూపొందించినవే. 'ఇప్పటివరకూ పబ్లిసిటీ కోసం ఒక్క రూపాయి కూడా ఖర్చుచేయాల్సిన అవసరం రాలేదు' అని నవ్వుతూ చెబుతుంది లక్ష్మమ్మ తల్లి!



పేరు: **శ్రీలక్ష్మి సురేష్**
హోదా: **ఈ - డిజైన్ టెక్నాలజీస్ వ్యవస్థాపకురాలు, సీయీవో**
వయసు- **పందొమ్మిది**

## బడి... బస్సు... ఓ బుడ్డోడు!

ఇంకా ఓటు హక్కు కూడా రాని అర్జున్, ఐదేళ్ల క్రితమే (పన్నెండేళ్ల వయసులో) 'లటేరా లాజిక్స్' అనే సంస్థను స్థాపించాడు. స్కూల్‌బస్ ట్రాకర్, చాట్ యాప్, క్విజ్ యాప్, సేఫ్టీ యాప్... ఇలా ఎన్నోరకాల అప్లికేషన్లను రూపొందించాడు. ' ఓ రోజు భారీవర్షం వల్ల స్కూల్ నుంచి రావడం ఆలస్యమైంది. ఇంటికొచ్చేసరికి అమ్మానాన్నా కంగారు పడుతున్నారు. ఇలాంటి సందర్భాల్లో తల్లిదండ్రుల్లో ఆందోళన పోగొట్టేందుకు ఏమైనా చేయాలనిపించింది. అప్పుడు పుట్టిన ఆలోచనే ఈజీ స్కూల్ బస్ లొకేటర్ యాప్" అంటాడు అర్జున్. స్కూలుబస్సు ఎక్కడుందో, ఇక్కడిదాకా రావడానికి ఎంత సమయం పడుతుందో కచ్చితంగా తెలిసిపోతుంది. దీన్ని మరింత మెరుగుపరిచి 'లోకేటరా' అనే కొత్తయాప్‌ను తయారుచేశాడు అర్జున్. లాటిన్ అమెరికా, దుబాయ్, దక్షిణాఫ్రికా, పాకిస్తాన్ తదితర దేశాల్లోనూ దీన్ని ఉపయోగిస్తున్నారు. అంతేకాదు, ఒంటరి మహిళల కోసం 'ఐ-సేఫ్' అనే యాప్‌నూ సృష్టించాడు. లటేరా లాజిక్స్ సంస్థను స్థాపించేందుకు తండ్రి దగ్గర్నించి పది వేల రూపాయలు అప్పుగా తీసుకున్న అర్జున్, ఏడాదికే వడ్డీతో సహా తిరిగి ఇచ్చేశాడు. అర్జున్ చెన్నైలో పన్నెండో తరగతి చదువుతున్నాడు. చదువు పూర్తయ్యేసరికి ఫోర్బ్స్ సంపన్నుల జాబితాలో చేరినా చేరిపోగలడు.

పేరు: **ఎస్. అర్జున్**
హోదా: **లటేరా లాజిక్స్ వ్యవస్థాపకుడు, సీయీవో**
వయసు: **పదిహేడు**

## పిల్లల 'అమెజాన్'

బడి తెరిచారంటే చాలు... కొత్త పుస్తకాల కోసం వేట మొదలవుతుంది. ఒక్కో దుకాణంలో ఒకటి దొరుకుతుంది. అన్నీ ఒకచోట అంటే అసాధ్యమే. పాపం నాన్నలు! కాళ్లకు బలపం కట్టుకుని తిరుగుతారు. ఈ ఇబ్బందులకు పరిష్కారం కనుగొన్నాడు అవిరాట్ పురోహిత్. పాఠ్యపుస్తకాలే కాకుండా, విద్యాసంవత్సరానికి కావాల్సిన సామగ్రినంతా తన 'బ్యాగ్‌మైబుక్స్.కామ్' ద్వారా కొనుక్కోవచ్చని చెబుతున్నాడు. 'ఈ వెబ్‌సైట్‌లో మీరు చదివే స్కూల్ పేరునూ, మీ తరగతినీ ఎంపిక చేసి, అడ్రస్ చెబితే చాలు... అవసరమైన పుస్తకాలన్నీ ఇంటికే వస్తాయి. ఇది స్కూలు పిల్లల అమెజాన్' అంటాడు అవిరాట్. ప్రస్తుతం తనుపదో తరగతి చదువుతున్నాడు. నేరుగా కొనడం ద్వారా మధ్యవర్తుల ఖర్చు కూడా తగ్గుతుందని భరోసా ఇస్తున్నాడు. ఇప్పటికే నాలుగు ఇంటర్నేషనల్ స్కూళ్లతో ఒప్పందం చేసుకున్నాడు. చాలా మంది ఇన్వెస్టర్లు పెట్టుబడికి ముందుకొస్తున్నారు.

పేరు: **అవిరాట్ పురోహిత్**
హోదా: **బ్యాగ్‌మైబుక్స్.కామ్ వ్యవస్థాపకుడు**
వయసు: **పదిహేను**

## సూపర్ బ్రదర్స్

రెండో తరగతి నుంచే కంప్యూటర్ పాఠాలు నేర్చుకోవడం మొదలుపెట్టాడు శ్రావణ్ కుమారన్. పన్నెండేళ్లు వచ్చేసరికి మాతృభాష మాట్లాడినంత స్పష్టంగా కంప్యూటర్ ప్రోగ్రామింగ్ సూత్రాలు వల్లెవేయడం మొదలెట్టాడు. తమ్ముడితో కలసి 'క్యాచ్ మీ కాప్' అనే మొబైల్ గేమ్‌ను కనిపెట్టాడు.. 'కంప్యూటర్ల కంటే మొబైల్స్ వాడకమే విపరీతంగా పెరుగుతోందని తెలుసు, అందుకే మొబైల్ యాప్స్‌వైపు వచ్చాం. క్యాచ్ మీ కాప్ - మొబైల్ గేమ్‌ను ఆండ్రాయిడ్ అంగీకరించడంతో ధైర్యం పెరిగింది. 'గో డైమెన్షన్స్' సంస్థను స్థాపించాం" అంటాడు శ్రావణ్. పన్నెండో తరగతి చదువుతున్న శ్రావణ్, ఎవరి కిందా పనిచేయడం తనకు ఇష్టంలేదని కరాఖండిగా చెప్పేస్తాడు. "మా సంస్థలో పెట్టుబడి పెడతామని చాలా మందే అడుగుతారు. డబ్బు కోసం ఒకరి కింద పనిచేయదలుచుకోలేదు. మేమింకా బాగా చదువుకోవాలి. అందుకే సొంతంగానే సంస్థను నిర్వహిస్తున్నాం" అని చెప్పే శ్రావణ్, తమ్ముడితో కలిసి 'అల్ఫాబెటిక్స్ బోర్డ్', 'గో డొనేట్' అనే మరో పదకొండు యాప్‌లను కూడా రూపొందించాడు. సంజయ్ ఇప్పుడు చెన్నైలో పదో తరగతి చదువుతున్నాడు. 'యాప్'రే!



పేర్లు: **శ్రావణ్ కుమారన్, సంజయ్ కుమారన్**
హోదా: **గో డైమెన్షన్స్ వ్యవస్థాపకులు**
వయసు: **పదిహేడూ, పదిహేనూ**

## 'హృదయ్' పూర్వకంగా

'పూర్తిగా శాకాహారం తినే వారిలో పోషకాల లోపం ఎక్కువగా కనిపిస్తుంది. ముఖ్యంగా మాంసాహారంలో ఉండే ఒమెగా 3, బి-12, డి3 వంటివి వీరికి అందవు. ఇది ఆరోగ్య సమస్యలకు దారితీయవచ్చు. ఈ సమస్యలను తొలగిస్తుంది 'స్ట్రెంగ్త్-ఓ-సీడ్స్'. 'ప్రకృతిసిద్ధమైన డ్రైఫ్రూట్స్, మొలకెత్తిన విత్తనాలు, గింజల నుంచి ఈ పోషకాలను అందించడమే మా సంస్థ ఉద్దేశం' అంటాడు హృదయ్ దండ్. ఏడో తరగతి చదువుతున్న ఈ అబ్బాయి....అవసరమైన పదార్థాల్ని ముంబయిలోకి తన ఇంటి ఆవరణలోనే పండిస్తున్నాడు. ఆతర్వాత, ల్యాబ్‌లో పరీక్షించి నాణ్యతను నిర్ధారించుకున్నాకే అమ్మకానికి పెడతాడు. అప్పుడే, మారికో గ్రూప్ ఛైర్మన్ హర్ష్ మరివాలాతో వ్యాపార విస్తరణ గురించి చర్చలు కూడా జరిపాడు. ఆ తెలివితేటలకు పెద్దాయన నోరెళ్లబెట్టాడట! భవిష్యత్తులో మంచి వ్యాపారవేత్త అవుతావని ఆశీర్వదించాడట.



పేరు: **హృదయ్ దండ్**
హోదా: **'స్ట్రెంగ్త్-ఓ-సీడ్స్' వ్యవస్థాపకుడు**
వయసు: **పదమూడేళ్లు**

## 'నానీ'కి ప్రేమతో...

"ఏడాది క్రితం మా అమ్మ ఏదో పని మీద విదేశాలకు వెళ్లాల్సి వచ్చింది. అదే సమయంలో మా పనిమనిషి కూడా రావడం మానేసింది. నాన్న ఒక్కరే అన్నిపనులూ చేసుకోలేక బాగా ఇబ్బంది పడ్డారు. నానమ్మే ఉంటే ఎంత బాగుండేదో అనిపించింది. అప్పుడు వచ్చిన ఆలోచనే 'షాన్నీయాప్'. నా ఫ్రెండ్ నక్ష్ కోహ్లి కూడా చాలా సహకరించాడు. ఇద్దరం కలిసే వ్యాపారం చేస్తున్నాం" అంటాడు అవి దయాని. గుర్‌గావ్‌లో ఏడో తరగతి చదువుతున్న ఈ దోస్తులు రూపొందించిన షాన్నీ యాప్ ద్వారా .... నాన్నమ్మలూ, అమ్మమ్మలూ లేని పిల్లలు నానీలను అద్దెకు తెచ్చుకోవచ్చు. వాళ్లతో ఆడుకోవచ్చు, సరదాగా గడపొచ్చు. అయితే, అద్దె మొత్తంలో 30 శాతం షాన్నీ యాప్ క్రియేటర్స్‌కు కమీషన్‌గా వెళుతుంది. "షాన్నీకి ముందే 20 ఇళ్లలో సర్వే చేశాం. వాళ్ల ప్రతిస్పందన చూసి ఆశ్చర్యపోయాం. చదువుకున్న నానీలు వస్తే, ఎంత డబ్బైనా చెల్లించడానికి సిద్ధమని అన్నారు. అందుకే మా సంస్థ ద్వారా వెళ్లే నానీలతో ముందుగానే ఒక ఒప్పందం చేసుకుంటాం. మంచి నడవడిక కలిగిన వారినే ఎంపిక చేస్తాం. కాబట్టి, ఎలాంటి ఇబ్బందీ రాదు" అంటూ చేయితిరిగిన వ్యాపారవేత్తల్లా భరోసా ఇస్తున్నారీ అబ్బాయిలు. ఆ ఆలోచనలకు మామ్మలు 'మా దిష్టే తగిలేట్టుంది' అంటూ మురిసిపోతున్నారు.



పేర్లు: **అవి దయాని, నక్ష్ కోహ్లి**
హోదా: **షాన్నీ సంస్థ వ్యవస్థాపకులు**
వయసు: **పదమూడూ, పన్నెండు.**



# మయూరాల నిలయం!

**నెమలీక... హరివిల్లు కలనేత. కళ్లు చెదిరే నెమలీకలను ఒళ్లంతా కప్పుకుని, పురివిప్పి నాట్యమాడుతూ కనిపించే మయూరాలను దర్శించడం ఒక అద్భుతమైన అనుభూతి. అయితే రాను రానూ మయూరాలు మాయమవుతున్నాయి. వాటి సంఖ్య తగ్గిపోతోంది. అంతరించిపోతున్న నెమళ్ల సంఖ్యను పెంచేందుకు మన దగ్గరా ఒక ప్రయత్నం జరుగుతోంది. కడప జిల్లాలోని ఇడుపులపాయలో నెమళ్ల పునరుత్పత్తి కేంద్రం ఆ దిశగా కృషి చేస్తోంది.**

ఏ బడికో వెళ్తున్నట్టు గుంపులు గుంపులుగా నెమళ్లు. ఏ రవీంద్రభారతిలోనో నాట్యప్రదర్శన ఇవ్వడానికి రిహార్సల్ చేస్తున్నట్టు... పొదల మాటున పురివిప్పి ఆడుతుంటాయి కొన్ని. ట్యాంక్‌బండ్ మీద ప్రియుడి కోసం ఎదురుచూస్తున్న ప్రేయసిలా చెట్టు పైనుంచీ పరిసరాల్ని గమనిస్తుంటాయి మరికొన్ని. ఇడుపులపాయలోని నెమళ్ల పునరుత్పత్తి కేంద్రం- వందలకొద్దీ మయూరాల పుట్టిల్లు.

శేషాచలం కొండకు కలియుగ వైకుంఠవాసుడైన శ్రీ వేంకటేశ్వరుడు నెలకొని ఉన్న సప్తశిఖరాలు తలభాగమైతే, కడప జిల్లా ఇడుపులపాయలోని కొండలు తోకభాగమని అంటారు. కడపకు 57 కిలోమీటర్ల దూరంలో... ఇడుపులపాయ ట్రిపుల్ ఐటీకీ, శేషాచలం కొండలకూ మధ్యన ఆహ్లాదకర వాతావరణంలో ఈ నెమళ్ల పునరుత్పత్తి కేంద్రం ఉంది. 2008లో ప్రారంభమైన కేంద్రానికి తొలుత తిరుపతి ఎస్వీ జూలాజికల్ పార్కు నుంచి 20 నెమళ్లనూ, హైదరాబాద్ నెహ్రూ జూలాజికల్ పార్కు నుంచి 34 నెమళ్లనూ, సానిపాయ అటవీ ప్రాంతం నుంచి 5 నెమళ్లనూ తీసుకొచ్చారు. 2011 నుంచి నెమలి గుడ్లను సేకరించి, ఇక్కడే పునరుత్పత్తి ప్రారంభించారు. కారణమేదైనా మొదట విడత గుడ్ల నుంచి పునరుత్పత్తి జరగలేదు. అనంతరం తగు జాగ్రత్తలు తీసుకోవడంతో... ఇప్పటిదాకా సుమారు 100కు పైగా నెమలి పిల్లలు ఉత్పత్తి అయ్యాయి. ఇలా నెమళ్ల పునరుత్పత్తిని ప్రతి ఏటా కొనసాగిస్తూనే ఉన్నారు.

**ప్రత్యేక ఎన్‌క్లోజర్లలో...**

ఈ కేంద్రంలో గుడ్ల ద్వారా ఉత్పత్తి అయిన నెమలి పిల్లలను ప్రత్యేక ఎన్‌క్లోజర్‌లలో ఉంచి... పెంచి పెద్ద చేస్తున్నారు. వీటికి రోజూ బొరుగులు, పప్పులు, కొర్రలు, జొన్నలు, సజ్జలు, రాగులు, వేరుశనగ పప్పు దాణాగా వేస్తారు. సమీపంలోని చక్రాయపేట, వేంపల్లె మండలాల నుంచి పశువైద్య అధికారులు వచ్చి, వీటి బాగోగులు చూస్తుంటారు. అవసరమైతే చికిత్సలూ చేస్తుంటారు. పునరుత్పత్తి కేంద్రంలో సరిపడా పెద్దా, చిన్నా నెమళ్లను ఉంచుకొని మిగిలిన వాటిని అటవీశాఖ అధికారుల అనుమతితో అడవిలోకి వదులుతారు. ప్రస్తుతం పునరుత్పత్తి కేంద్రంలో అన్నీ కలిసి నూటా అయిదు నెమళ్లదాకా ఉన్నాయి. ఈ కేంద్రం పుణ్యమా అని ఇడుపులపాయ సమీపంలోని శేషాచల అటవీ ప్రాంతంలో కిలోమీటరుకు ఒకటి చొప్పున మయూరాలు దర్శనం ఇస్తుంటాయి.

**నిర్వహణ భారం...**

తెలుగు రాష్ట్రాల్లోని ఏకైక నెమళ్ల పునరుత్పత్తి కేంద్రం ఇదే. అయినా తీవ్ర నిధుల కొరతే. అరకొరగా వనరుల కేటాయింపు జరుగుతోంది. ఈ యేడాది కేవలం రూ. 1.14లక్షలు మాత్రమే కేటాయించారు. "నిర్వహణ తలకుమించిన భారమవుతోంది. ఉన్న నిధులతోనే నెమళ్ల పునరుత్పత్తి కేంద్రాన్ని నిర్వహిస్తున్నాం. సరిపడా మొత్తాన్ని ప్రభుత్వం కేటాయిస్తే పూర్తిస్థాయిలో పునరుత్పత్తికి అవకాశం ఉంటుంది" అంటారు వేంపల్లె అటవీశాఖ రేంజర్ రెడ్డయ్య. ఈ నెమళ్ల పునరుత్పత్తి కేంద్రం గురించి పెద్దగా ప్రచారం కూడా లేదు. చుట్టుపక్కల నుంచీ అప్పుడప్పుడు సందర్శకులు వచ్చి, నెమళ్లను చూసి ఆనందిస్తుంటారు.

ఈ మయూర వనాన్ని సందర్శించాలంటే కడప నుంచి రోడ్డు మార్గం ద్వారా మండల కేంద్రమైన వేంపల్లెకు చేరుకొని, అక్కడి నుంచి ఇడుపులపాయకు వెళ్లాల్సి ఉంటుంది. అంత దూరం ప్రయాణించిన బడలిక, పురివిప్పిన నెమలిని చూడగానే పరారైపోతుంది.

**- జయచంద్ర, వేంపల్లె**



నెమలి గుడ్లు



# మూలాల్నించి తీసేయనిదే సొరియాసిస్ నుంచి ముక్తి లేదు

సొరియాసిస్ ఇలా ఒళ్లంతా పాకేదాకా ఏ ట్రీట్‌మెంట్ తీసుకోకుండా ఎలా ఉన్నారండీ! అంటే ట్రీట్‌మెంట్ తీసుకోకుండా ఎలా ఉంటాం సార్! ఇదేమైనా నిద్రపోనిస్తుందా? నీళ్లు తాగనిస్తుందా? దురదా మంటలతో పగలూ రేయీ నరకాన్ని చూడటమే కదా! కాకపోతే వాళ్లిచ్చిన మందులన్నీ పై పూతలకు పరిమితమైనవే. మాత్రలేవో ఇచ్చినా అవి స్టెరాయిడ్స్ కలిపినవని తెలిసి వాటిని పక్కకు పెట్టేశాను. నా బాధ నాకుంటే చుట్టుపక్కల వాళ్లంతానేమో పురుగును చూసినట్టు చూస్తారాయే. ఈ జబ్బును మేమేతో ఆహ్వానించినట్టు? వాళ్లు అలా చూడటమేనా? ఈ వ్యాధికి అసలు మందే లేదు. జీవితమంతా మీరిలా బాధపడాల్సిందే! అంటూ ఇలా శాపనార్థాలు పెట్టిపోతుంటారు కదా! ఇన్నాళ్లకు మీ గురించి ఏదో తెలుసుకుని ఇలా వచ్చాం." అంటూ తమ వ్యథను వెళ్లకక్కుతుంటారు.

వాస్తవానికి సొరియాసిస్ శరీరం లోలోతుల్లోకి విస్తరించే వ్యాధి. ఈ క్రమంలో శరీరంలోని సప్తధాతువులూ ఒక్కొక్కటిగా క్షీణిస్తూ వెళతాయి. ధాతువులు క్షీణిస్తూపోయే కొద్దీ శరీరంలో వాత ప్రకోపం పెరుగుతుంది. ఇది నరాల వ్యవస్థను దారుణంగా దెబ్బ తీస్తుంది. గుండెపోటు, పక్షవాతం వంటి సమస్యలకు మూలం కావడమే కాదు దేహక్రియలన్నీ కుంటుపడేలా చేస్తుంది. సొరియాసిస్‌తో ఎముకలకు సంబంధించిన అస్థిధాతువు కూడా క్షీణించడంతో వెన్నెముక సమస్యలు, కీళ్ల సమస్యలు మొదలవుతాయి. బాహ్యంగా చేసే పంచకర్మ చికిత్సలతో పాటు అంతర చికిత్సలు కూడా ఇక్కడ ఎంతో కీలకం. అందుకే సొరియాసిస్ నుంచి శాశ్వతంగా విముక్తి పొందాలంటే, పంచకర్మ చికిత్సలూ, ఔషధ చికిత్సలూ సమాంతరంగా సాగాలి.

**మూలాల్లోకి చొచ్చుకుపోతుంది**

చర్మం మీదే కనిపించే సొరియాసిస్‌కు ధాతువులను దెబ్బ తీసేంత శక్తి ఉంటుందా అని కూడా కొందరు అనుకుంటారు. నిజానికి సొరియాసిస్‌కు సప్తధాతువులనే కాదు, సమస్త శరీర వ్యవస్థలనూ ధ్వంసం చేసే తత్వం ఉంటుంది. అలా ధాతువులు క్షీణిస్తూ వెళ్లే కొద్దీ శరీరంలో వాతం పెరిగిపోతుంది. ఒక్క వాతం సంతులనం (బ్యాలెన్స్) కోల్పోతే ఆ ప్రభావంతో మిగతా పిత్తం, కఫం కూడా సంతులనం కోల్పోతాయి. అయితే, చికిత్సా విధానాలతో ఒక్క వాతాన్ని తిరిగి సాధారణ స్థితికి తెస్తే, పిత్త కఫాలు కూడా సాధారణ స్థితికి వస్తాయి. అందుకే ఆయుర్వేదం వాత నియంత్రణకు ప్రాధాన్యతనిస్తుంది.

**ఆయుర్వేదమే అసలైన వైద్యం**

సొరియాసిస్ మచ్చలు చర్మం మీదే కనిపిస్తున్నాయని, పైపై వైద్యాలకే పరిమితమైతే సొరియాసిస్ రోజురోజుకూ పెరుగుతూనే వెళుతుంది. అందుకే, కేవలం బాహ్య చికిత్సలకో లేదా ఔషధాలకో పరిమితమైతే సొరియాసిస్‌కు అది పరిపూర్ణ వైద్యం కాదు. సొరియాసిస్‌కి కారణమైన ఆమాన్ని అంటే విషపదార్థాలను ముందు పంచకర్మ చికిత్సల ద్వారా తొలగించాలి. ఆ తరువాత ధాతుక్షయాన్ని నివారించే ఔషధాలు కూడా ఇవ్వాలి. వమనం, విరేచన కర్మల ద్వారా శరీరంలోని మలినాలన్నీ తొలగిస్తే వాతం అప్పుడు నియంత్రణలోకి వస్తుంది. వాతం నియంత్రణలోకి రాగానే మిగతా పిత్త, కఫాలు కూడా అదుపులోకి వస్తాయి. అప్పుడే సొరియాసిస్ సమూలంగా తొలగిపోతుంది. ఆ తరువాత వ్యాధిని సమూలంగా తొలగించడానికి మరో మూడు నాలుగు మాసాల పాటు కడుపులోకి ఇచ్చే ఔషధాలు తీసుకోవాలి. అన్నీ కలిసి, సొరియాసిస్‌తో పాటే వచ్చిన నరాల సమస్యలు, వెన్ను, కీళ్ల సమస్యలు తొలగిపోతాయి. ఒకవేళ లైంగిక సమస్యలు కూడా మొదలైతే, అవి పూర్తిగా తొలగిపోయి శరీరం శక్తివంతంగా మారుతుంది. వైద్య చికిత్సలు పూర్తి అయిపోయిన తర్వాత శరీరం మీద సొరియాసిస్ ఛాయలే కనిపించవు.



**డాక్టర్ ఎన్. రామకృష్ణారెడ్డి**
**ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్**

| | |
|---|---|
| కూకట్‌పల్లి | 8886922245 |
| నాంపల్లి | 8886922247 |
| హన్మకొండ | 8886922248 |
| విజయవాడ | 8886922249 |
| వైజాగ్ | 8886922250 |
| కర్నూలు | 8886922251 |
| తిరుపతి | 8886922252 |

## లూకోకిట్ వాడితే తెల్ల మచ్చలు పారిపోవాల్సిందే

తెలుపు రంగు అంటే అందరికీ ఇష్టమే కదా! మరి ఒంటి మీద నాలుగు తెల్ల మచ్చలు కనపడితే ఎందుకలా వింతగా చూస్తారు? కొందరు అలా కాసేపు చూస్తూ వెళ్లిపోతారు గానీ, మరి కొందరేమో గుచ్చి గుచ్చి అడుగుతారు. మన ఒంటి మీద మనకసలు స్పృహే లేనట్లు, ఏమిటా మచ్చలు? ఏ డాక్టర్‌కూ చూపించలేదా? పోనుపోను ఒళ్లంతా పాకిపోతుంది అప్పుడేం చేస్తారు? ఇలాంటి ప్రశ్నలు కూడా నిర్మొహమాటంగా అనేస్తారు. మేమేదో చెట్టుకు నీళ్లు పోసి పెంచినట్లు, ఈ మచ్చలకు మేమేదో ఎరువు వేసి సాకుతున్నట్లు మాట్లాడతారు. అంతటితో ఆగితే మహా భాగ్యమే. కొందరైతే మేము గత జన్మలో చేసిన పాపాల ఫలితమని కూడా అనేస్తారు. ఇంక కాస్త గిట్టని వాళ్లయితే, వాళ్ల నోటికి హద్దూ పద్దూ ఉండదు. మా బాధ మాకుంటే వీళ్ల వేదింపులేమిటి? అసలు తెల్ల మచ్చల వ్యాధికి ఎక్కడా శాశ్వత చికిత్సే లేదంటూ వాళ్లు అదేపనిగా ఊదర గొడుతూ ఉంటే వాళ్ల మాటల్ని మా లాంటి వాళ్లు నమ్మే పరిస్థితే ఏర్పడింది.

**అసత్య ప్రచారమే ఎక్కువ**

సమస్య ఏమిటంటే, ఏవ్యాధి పైనా సమగ్రమైన పరిశీలన గానీ, పరిశోధన గానీ, చేయకుండానే ఈ వ్యాధికి మందే లేదని చెప్పే వైద్య వ్యవస్థలు సమాజంలో పెద్ద సంఖ్యలోనే ఉన్నాయి. వాళ్ల మాటల్నే ప్రమాణం తీసుకుని మరికొంత మంది వారి ఏజంట్లలా వ్యవహరిస్తూ ఉంటారు. బతికినంత కాలం మందులు వాడుతూనే ఉండాలి తప్ప ఈ సమస్య శాశ్వతంగా తగ్గిపోయే అవకాశమే లేదంటూ వాళ్లు కూడా ప్రచారం మొదలెడతారు. ఇవన్నీ కలిసి అంతిమంగా తెల్లమచ్చలతో బాధ పడేవారంతా వైద్య విధానాల మీద ఆశలు వదులుకునే పరిస్థితి ఏర్పడుతుంది.

వాస్తవానికి, ఎంతటి దీర్ఘకాలిక వ్యాధినైనా సమూలంగా నయం చేసే అద్భుతమైన ఔషధాలు మనం ఆయుర్వేదంలో ఉన్నాయి. తెల్ల మచ్చలకు అలాంటి శక్తివంతమైన ఔషధాలే ఉన్నాయి. ఆధునిక వైద్యులు తెల్ల మచ్చలకు ఈ రోజున కూడా మందే లేదని చెబుతున్నారు గానీ, 5 వేల ఏళ్ల క్రితమే ఆయుర్వేద శాస్త్రం ఈ వ్యాధిని సమూలంగా తొలగించే ఔషద మూలికలను సూచించింది. ఆ మూలికల కలయికలతోనే శ్రీ ధన్వసాయి ఆయుర్వేదిక్ ఫార్మసీ తెల్ల మచ్చలను సమూలంగా నిర్మూలించే లూకోకిట్ అనే ఔషధాన్ని తయారు చేసింది.

**ఎలాంటి కారణాలు....**

తెల్ల మచ్చలు రావడానికి గల కారణాల్లోకి వెళితే.... ఇవి కూడా అనేకం. వాటిలో ప్రధానంగా, శరీరంలో వ్యర్థ విష పదార్థాలు పేరుకుపోయి, వ్యాధినిరోధక శక్తి తగ్గిపోవడం ఒక కీలకాంశం. ఈ విషపదార్థాలు రక్తంలోకి ప్రసరించినపుడు రక్తంలోని హీమోగ్లోబిన్ పరిమాణం పడిపోతుంది. ఫలితంగా, శరీరంలోని మెలినిన్ తగ్గిపోయి చర్మం తన సహజ వర్ణాన్ని కోల్పోతుంది. ఇది తెల్ల మచ్చలు రావడానికి కారణమవుతుంది. ఆహారంలో ఫెర్రస్, కాపర్ లోపించడం కూడా ఇందుకు కారణమే. నానాటికి ప్రకృతికి దూరమైపోతున్న కారణంగా మానవ శరీరాల్లో విటమిన్ - డి తగ్గిపోతోంది. ఫలితంగా శరీరానికి వర్ణాన్నిచ్చే మెలనోసైట్స్ తగ్గిపోతాయి. ఫలితంగా తెల్లమచ్చలు ఏర్పడతాయి.

**లూకోకిట్ గురించి...**

ఈ లూకోకిట్‌లో మూడు రకాల ట్యాబ్లెట్లు ఉంటాయి. వీటిని ఉదయం సాయంత్రం భోజనం తర్వాత వేసుకోవాలి. వీటితో పాటు చర్మం మీద పూసుకునే కలర్‌కాట్ ఎల్, కలర్‌కాట్- ఎల్ మిక్స్ ద్రావణం కలయికలతో చర్మానికి సహజ వర్ణాన్నిచ్చే ఔషధం తయారు చేయబడింది. సహజ వర్ణం పోయి తెల్ల మచ్చలు ఏర్పడిన చోట ఈ ద్రావణాన్ని అప్లై చేసి 10 నుంచి 15 నిమిషాల పాటు ఎండలో కూర్చోవాలి. రోజూ ఉదయం, సాయంత్రం ఇలా చేస్తే మంచి ఫలితాలు వస్తాయి. ఇది జీవిత కాలపు శిక్ష అనుకున్న మచ్చలు మాయమైపోతాయి.

ADVT

## ఈ వారం కథ

**ఉగాది పండుగకి వారాంతపు సెలవు కలుపుకుని ఇంటికి ప్రయాణమయ్యాను. ఉద్యోగపు ఒత్తిళ్లను మించి గత కొద్ది రోజులుగా జరిగిన సంఘటనలు నన్ను నిస్సత్తువకి గురి చేస్తున్నాయి. నాలుగేళ్లుగా ఈ నగరంలో నాకు తోడుగా ఉన్న స్నేహితురాలు కీర్తిని ఒంటరిగా వదిలి అమ్మ ఒళ్ళో సేద దీరేందుకు బయలుదేరాను. ఒక్కదాన్నీ వెళ్లేందుకు మనస్కరించకపోయినా పండక్కి అమ్మ ఎదురుచూస్తూ ఉంటుందని కీర్తే నన్ను బయలుదేరదీసింది. పోనీ అలవాటైన మనుషులే కదా కూడా రమ్మంటే రానంది. నా సంశయం చూసి "భయంలేదు ప్రత్యూషా, నేను ఎలాటి అడ్వెంచర్లు చెయ్యనులే. హాయిగా వెళ్లిరా" అంటూ ఆటో ఎక్కించింది. అంతలోనే, సన్నని వాన మొదలైంది.**

కీర్తితో వర్కింగ్ విమెన్స్ హాస్టల్‌లో మొదలైన పరిచయం స్నేహంగా మారిన సంగతులన్నీ జ్ఞాపకం వస్తున్నాయి. మా ఇద్దరి అభిరుచులూ వేర్వేరే అయినా ఎక్కడా మామధ్య సంఘర్షణ లేదు. ఇంటి పనుల్లో సాయం చేసే జయమ్మ కూతురు ప్రేమపెళ్లి విఫలమైనప్పుడు తనకే అన్యాయం జరిగినట్టు దుఃఖపడింది. 'ఈ ప్రేమలు ఎవరు నేర్పారు నీకు' అంటూ ఆ పిల్లని నిలదీసి, ఆపైన ఓదార్చి, ధైర్యం చెప్పింది. ఆమె తన కాళ్లమీద తను నిలబడేవరకూ వెన్నంటి ఉంది. కీర్తి పట్టుదల అప్పుడు ప్రత్యక్షంగా చూసాను.

కీర్తి పెరిగిందంతా ముంబాయిలోనే. ఆమె తల్లి ఒక మహారాష్ట్రియన్‌ని పెళ్లి చేసుకోవటంతో అక్కడే స్థిరపడిపోయారు. కీర్తి అమ్మమ్మ ఒక్కగానొక్క కూతుర్ని వదులుకోలేకపోయింది. కీర్తి తల్లిదండ్రులిద్దరూ తీరికలేని ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఆమెకి ఇంటితో ఉన్న అనుబంధం అంతా అమ్మమ్మతోనే. ఉద్యోగ రీత్యా ఆంధ్రా వచ్చినప్పుడు అమ్మమ్మ కూడా వస్తానంటే, ఇల్లు తీసుకున్నాక తీసుకెళ్తానని ఆవిణ్ణి ఒప్పించింది. ఇల్లు తీసుకునే లోపే ఆవిడ అకస్మాత్తుగా పోవడంతో, అమ్మమ్మ కోరిక తీర్చనేలేదని బాధ పడింది. ఫ్లాట్ తీసుకుని, వంటతో ప్రయోగాలు మొదలెట్టాక కీర్తి అమ్మమ్మ మా కబుర్లలోకి తరచుగా వచ్చేది. అందుకేనేమో నాతో పాటు ఊరు వచ్చినప్పుడు క్షణం కూడా నానమ్మని వదల్లేదు. నానమ్మకీ కీర్తి కలుపుగోలుతనం ఎంతో నచ్చేసింది.

● ● ●

రైల్వే స్టేషన్ ఎప్పటిలాగే సందడిని పోగేసుకుని ఉంది. అప్పటికే నేనెక్కాల్సిన రైలొచ్చి ఫ్లాట్‌ఫామ్ పైన ఉంది. పక్క పరుచుకుని కొందరప్పుడే నిద్రకి ఉపక్రమిస్తున్నారు.

● ● ●

మళ్లీ నా ఆలోచనల్లో కీర్తి! గత ఏడెనిమిది నెలలుగా కీర్తిలో మార్పు నేను గమనించకపోలేదు. మరింత ఉత్సాహంగా కనిపిస్తోంది. విషయం ఏమిటని నేను అడగలేదు. నాతో పంచుకునేదైతే తనే చెబుతుంది కదా!

ఒకసారి హర్షని ఇంటికి తీసుకొచ్చి పరిచయం చేసింది. కీర్తిలో మార్పుకి కారణం అర్థం అయింది. కీర్తి కబుర్లు ఇప్పుడు హర్ష చుట్టూ తిరుగుతున్నాయి. ఆమె జీవితంలో పరిమళిస్తున్న ప్రేమ సుగంధాన్ని మౌనంగా గమనిస్తున్నాను. కీర్తికీ, నాకూ మధ్య మాదైన సమయం తగ్గుతోంది. కబుర్ల మధ్య అలవోకగా నిద్రలోకి జారుకునే అలవాటు మారి ఇప్పుడు ఒంటరిగా తలో గదిలో నిద్రకి ఉపక్రమిస్తున్నాం. హర్షతో ఫోన్ సంభాషణలు నాకు ఇబ్బంది కలిగించకుండా కీర్తి ఇలా ఏర్పాటు చేసింది.

ఆ తర్వాతేమైందో నాకు తెలియదు. ఒక ఉదయం కీర్తి స్పృహ తెలియని స్థితిలో ఉండడం చూసి హాస్పిటల్‌కి పరుగెత్తాను. ప్రమాదం నుంచి బయటపడింది. కీర్తి లాటి ధైర్యమున్న పిల్ల ఇంత పిరికిపని చేస్తుందంటే నమ్మశక్యంగాలేదు. ఏమై ఉంటుంది? హర్షతో గొడవలా? దానికోసం ఇంత ప్రమాదం కొనితెచ్చుకుందా?

ఆసుపత్రిలో కీర్తి కోసం కూర్చున్న ఆ రోజు మనసు అస్థిమితం అయిపోయింది. ఇలాటి ప్రమాదం అంచుకి వెళ్లకుండా కాపాడుకున్న శైలు జ్ఞాపకం వచ్చింది.

రెండు నెలల క్రితం ఊరెళ్లినప్పుడు నానమ్మ చెప్పిన మాటలు విస్మయాన్ని కలిగించాయి. సివిల్స్‌కి వెళ్లాలంటూ కలలు కనే శైలు చదువు మీద శ్రద్ధ చూపించడంలేదట. స్కూటీ కొనిపించుకుని ఊరంతా తిరిగేస్తోందని నానమ్మ గొడవ. నమ్మకం కుదరక శైలు దగ్గరకెళ్తే, చటుక్కున వచ్చి నన్ను చుట్టుకుని 'నీతో చాలా చెప్పాలక్కా ... నాకు చదువుకోవాలని లేదు. ఉన్న విషయం నీతో చెప్పేస్తున్నాను. వీళ్లకి ఇంకా చెప్పలేదు. నేను సందీప్‌ని ప్రేమిస్తున్నాను. పెళ్లి చేసుకుంటాను" అంది సీరియస్‌గా. ఊహకందని విషయం!

"ఇదేమిటి శైలూ అకస్మాత్తుగా? అసలీ సందీప్ ఎవరు?" నా ముఖంలోనే ప్రశ్నలు కనిపించేసి ఉంటాయి.

"సందీప్ నా స్నేహితురాలు దీప్తి వాళ్ల అన్నయ్య. ఇప్పుడు ఈ ఊర్లోనే ఉన్నాడు, సాయంత్రం చూపిస్తానులే" అంది ఉత్సాహంగా. ముఖంలోని దిగులు మాయమైంది.

"అతను నీకెప్పుడు పరిచయం? పెళ్లి చేసుకుంటానని చెప్పాడా? ఇంత చిన్నవయసులో పెళ్లా? అలాటి ఆలోచన ఉంటే బాబాయ్ దగ్గరకొచ్చి చెప్పాలి కానీ నీతో ఎందుకు చెబుతున్నాడు?"

"తను మొన్నటిదాకా పూణేలో ఉద్యోగం చేసేవాడు. ఇప్పుడు అమెరికా అవకాశం వచ్చిందని ఆ ఏర్పాట్లలో ఉన్నాడు. నాకు చాలా నచ్చాడు".

"మరి అతనికి నువ్వు నచ్చావా? నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పాడా?"

"విడిగా చెప్పాలా అక్కా, నన్నెప్పుడూ మెచ్చుకుంటాడు. క్రితం నెల నా పుట్టినరోజుకి



తను కూడా కొత్త బట్టలు వేసుకున్నాడు" నా వెనకాలే చెయ్యి పట్టుకుని స్కూలుకొచ్చిన చిన్నారేనా ఈ శైలు?! నా చేతివేళ్ల ఆసరాతో అక్షరాలు దిద్దిన ఆ పసిపిల్లేనా?

భోజనం చేసి మా సంభాషణ గురించి ఆలోచిస్తూ నిద్రపోయాను. సాయంకాలం శైలు వచ్చి లేపింది, "అక్కా, సందీప్, దీప్తి మనింటికొచ్చారు. తొందరగా రా" చెప్పి వెళ్లిపోయింది.

బాబాయ్ వాళ్ల గుమ్మంలోకి వెళ్లేసరికి ఎదురుగా అతిథులు. సందీప్ తన అమెరికా ప్రయాణం, ఏర్పాట్లు గురించి చెబుతున్నాడు. దీప్తి, శైలు అక్కడే ఉన్నారు. శైలు ముఖంలో సంతోషం దాగనంటోంది. నన్ను చూసి ఎదురొచ్చింది. బాబాయ్ అతనికి నన్ను పరిచయం చేసాడు. చూసేందుకు చక్కగా ఉన్నాడు. శైలు మధ్యాహ్నం చెప్పిన మాటలే గుర్తొచ్చాయి అతన్ని చూడగానే.

కబుర్లు అయి "వెళ్లొస్తాం అంకుల్. ఇంకో వారంలో నా ప్రయాణం. చెప్పి వెళదామని వచ్చాను. దీప్తితో పాటు ఇప్పుడు నాకు ఇంకో చెల్లెలు దొరికింది. కానీ మా దీప్తిలా గడుసుపిల్ల కాదు. చాలా అమాయకురాలు శైలు" నవ్వుతూ చెబుతున్నాడతను.

"నువ్వు సివిల్స్‌కి వెళ్తావని తెలిసింది. మన ఊరు పేరు నిలబెట్టాలి. మమ్మల్ని మరచిపోకూడదు సుమా" అంటూ ఆప్యాయంగా శైలు చేతిని నొక్కి వదిలి బయటకి నడిచాడు సందీప్. నాకు గొప్ప రిలీఫ్ అనిపించింది. తలతిప్పి చూస్తే పాలిపోయిన ముఖంతో శైలు నిశ్శబ్దంగా కూర్చుంది. ఆమె మనసులో సంఘర్షణ చెంపల మీదుగా కన్నీరవుతోంది. నేను ఓదార్చే ప్రయత్నం చెయ్యలేదు. తననీ ఆలోచించుకోనీ.

నన్ను మొదటిసారిగా ఉద్యోగానికి పంపుతూ అమ్మ చెప్పిన మాటలు పదేపదే జ్ఞాపకమొస్తున్నాయి.

తెల్లవారితే ప్రయాణం. మనసంతా భారంగా ఉంది. ఇన్నేళ్లూ అమ్మానాన్నల సమక్షంలో ఏ బాధ్యతలూ లేని జీవితం! నన్ను చూసుకునే వాళ్లున్నారన్న భరోసా. ఇకపైన ఉద్యోగం చేసుకుంటూ స్వతంత్రంగా జీవించే నేను నాకంటూ ఒక పెద్దరికాన్ని తొడుక్కోబోతున్నాను. అలా ఆలోచిస్తేనే ఏదో తెలియని పిరికితనం కలుగుతోంది. చుట్టూ ఉన్న ప్రపంచం కొత్తగా కనిపిస్తోంది. నేనుగా దాన్ని ఎదుర్కోబోతున్నానన్న ఆలోచన భయపెడుతోంది. ఆ పూట అమ్మపక్కలో చేరాను.

రాత్రంతా నిద్రరాక మసులుతుంటే అమ్మ లేచి కూర్చుంది, "ఏరా, బెంగగా ఉందా?"

# ఏల ప్రేమింతు నిన్ను?

**అనూరాధ నాదెళ్ల**



●●●

నా ఆలోచనలు చెదరగొడుతూ కీర్తి ఫోన్.

"ప్రత్యూ, రైలు బయలుదేరిందా?"

ఇద్దరం ఒకరి గురించి ఒకరం ఆలోచిస్తూనే ఉన్నామన్న మాట! జవాబు చెప్పి చుట్టూ చూసాను. రైలు వేగంగా పరుగెడుతోంది. బోగీ నిశ్శబ్దంగా ఉంది. బెర్త్ పరుచుకున్నాను. కానీ నిద్ర వచ్చేలా లేదు, నా ఆలోచనలు కీర్తి వైపుకి మళ్లాయి మళ్లీ.

●●●

కీర్తి ఆసుపత్రి నుంచి వచ్చింది. నా ప్రశ్నలు నాలోనే ఉన్నాయి. రెండురోజులు మౌనంగా గడిచాక మూడో రోజు నాతో పాటు ఆఫీసుకి బయల్దేరింది. "శెలవు పెట్టి ఇంటికి వెళ్లిరాకూడదూ" అంటే వద్దంది.

ఈ రెండు రోజులూ కీర్తిని చూస్తున్నప్పుడల్లా ఒక వరదలా ఆలోచనలు కమ్ముకుంటున్నాయి. ఇప్పుడైతే కీర్తి మామూలు మనిషి అవుతోంది. కానీ ఏదైనా జరగకూడనిది జరిగి ఉంటే!?

అంది అనునయంగా. అమ్మ కూడా నిద్రపోలేదని అర్థమైంది. "అమ్మా!" అని కన్నీళ్లు పెట్టుకుంటున్న నన్ను ఓదార్పుగా దగ్గరగా తీసుకుంది అమ్మ.

"పోనీ ఇప్పుడా ఉద్యోగం అవసరమంటావా? మానెయ్. ఇంత దిగులుగా నువ్వు వెళ్తుంటే నేను పంపలేనురా" అమ్మ మాటలకి ఉలిక్కిపడ్డాను. లేదు, లేదు, నేను బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం చెయ్యాలని ఎన్ని కలలు కన్నాను. నా ఆదర్శం లక్ష్మత్త కాదూ. చిన్నప్పుడంతా లక్ష్మత్తలా చదువుకుంటాను అని చెప్పేదాన్నని ఇప్పటికీ అమ్మ చెబుతుంది. ఇప్పుడీ బెంగలు నా ఆదర్శాన్ని దెబ్బతీస్తే ఇంతకాలం కన్నకలలకి అర్థం లేదు. అమ్మ మాటలు నన్ను కర్తవ్యం వైపుగా ఆలోచించేలా చేస్తున్నాయి.

"నేను వెళ్తాలమ్మా" అన్నాను గొంతు పెగుల్చుకుని. అమ్మ నవ్వింది.

"ప్రత్యూ, అత్త అంతంత చదువులు ఎలా చదువుకుంది ఆ కాలానికి అని అడిగేదానివి కదూ, ఇప్పుడు చెబుతా విను, లక్ష్మత్త పదోక్లాసు పరీక్షలు ముందు ఎవరో మంచి సంబంధం ఉందని, వాళ్లు చేసుకుంటామని అడుగుతున్నారని తాతగారికి చెప్పారుట. తాతగారి మాట వేదవాక్కే ఇంట్లో. కానీ అత్త 'ఇంకా చదువుకుంటాననీ, పెళ్లి వద్దని' తాతగారి ఎదుట పడి ధైర్యంగా చెప్పేసిందిట. ఆయన కోపంతో 'నీ అభిప్రాయం నేను అడగలేదు' అని కేకలేసారుట. అత్త తన పట్టు వదల్లేదు. 'పెళ్లి చేసుకోను' అని కచ్చితంగా చెప్పేసిందట. ఆ తర్వాత ఇంట్లో విపరీతమైన టెన్షన్. రెండు రోజులు తాతగారు భోజనం మానేసారుట. ఆఖరికి తాతగారు ఆ సంబంధం వదిలేసుకున్నారు.

ఒకరోజు నానమ్మతో అసలు విషయం

చెప్పింది, 'స్కూలు నుంచి వస్తుంటే తననీ, తన స్నేహితురాళ్లనీ ఎప్పట్నుంచో ఆ పెళ్లికొడుకు ఏడిపిస్తున్నాడనీ, అలాటి వాడిని చేసుకోమంటారా' అనీ అడిగిందట. ఆ తర్వాత నెమ్మదిగా ఎవరిద్వారానో తాతగారికీ ఆ పిల్లవాడి సంగతి తెలిసిందట. తను పొరపాటు చెయ్యకుండా కూతురే అడ్డుకుందని ఆయన అర్థం చేసుకున్నారు. ఆపైన ఆడపిల్లల చదువు మీద శ్రద్ధ చూపించారుట. ఇదంతా ఎన్నో ఏళ్ల క్రితం అత్త నాతో చెప్పింది."

నిద్ర పూర్తిగా తేలిపోయి అమ్మ చెబుతున్న కబుర్లు వింటున్నాను. లక్ష్మత్త ఎంత చక్కటి నిర్ణయం తీసుకుంది, చిన్నపిల్ల! గట్టిగా పదిహేనేళ్ళ లేని పిల్ల, ధైర్యంగా తనకు నచ్చని విషయాన్ని చెప్పటం, మంచి చెడుల విశ్లేషణ చెయ్యగలగటం నలభై - యాభై ఏళ్ల క్రితం సమాజంలో చెప్పుకోదగ్గ విషయం. తన మాట పోతుందని ముందు కోపం తెచ్చుకున్నా తాతగారు కూతురి నిర్ణయం సరైనదే అని ఒప్పుకున్నారు.

"ప్రత్యూ, ఇప్పుడు ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా, ఆడపిల్ల తన వ్యక్తిత్వం నిలబెట్టుకోవాలి. దానిని తక్కువచేసే ఎవరినైనా, ఏ పరిస్థితినైనా ఎదిరించాల్సిందే. చదివిన చదువు, దానితో పాటు స్వంతకాళ్ల మీద నిలబడగలిగే శక్తి ఇచ్చే ఆత్మవిశ్వాసం అలా ఎదిరించే బలాన్నిస్తుంది. ఇకపైన నీ జీవితానికి నువ్వే కర్తవి. అవసరమైన నిర్ణయాలు నువ్వే తీసుకోగలగాలి. వెనుక మేము ఉన్నాం. కానీ అంతిమంగా నీ విచక్షణ నీకు మార్గదర్శి అవ్వాలి" అమ్మ అంత గంభీరంగా మాట్లాడటం ఎప్పుడూ చూడలేదు నేను. ఆ రాత్రి అమ్మ ఒడిలో గువ్వలా ఒదిగిపోయాను కళ్ల మూతలు పడుతుండగా.

అమ్మ మాటలు ఇన్నేళ్ళుగా నాకు దారి చూపుతూనే ఉన్నాయి.

•••

కీర్తి ఎక్కడ పొరబడింది?! ఇలాటి సందర్భం ఎందుకని వచ్చింది. మనుషుల్ని సరిగా అంచనా వెయ్యలేని అమాయకత్వమా? అవగాహనా లోపమా?

ఆ ఆదివారం ఇద్దరం కలిసి కాటన్ బట్టలకి గంజి పెట్టుకుంటుంటే మొదటిసారిగా తనే మాటలు మొదలు పెట్టింది కీర్తి.



"ప్రత్యూ, నీకు ఇంత దగ్గరగా వచ్చినా ఇప్పటిదాకా ఏమీ చెప్పలేదు కదూ. ఏదో నాకు మాత్రమే సంబంధించినదన్న ఒక పొసెసివ్‌నెస్ నన్ను కమ్మేసింది. నన్ను, నా వాలకాన్ని చూసి కూడా ఒక్క ప్రశ్న వెయ్యకుండా నువ్వు ఎంత కంపోజ్డ్‌గా ఉన్నావే. నా ప్రవర్తనలో మార్పుని ఒక్కరోజూ నిలదియ్యలేదు. ఎంత నమ్మకం ఈ స్నేహితురాలి మీద!

'ఆడపిల్లలే ఎందుకిన్నిన్ని సార్లు మోసపోతుంటారు? చదువులేకా, తెలివిలేకా, ప్రపంచం పట్ల అవగాహన లేకా, ఆర్థిక స్వావలంబన లేకా? అని మనల్నో సందేహం వేధిస్తుంటుంది కదూ. అవన్నీ ఉన్నాకూడా ఎంత సులువుగా మాయలో పడతారో నేనే ఉదాహరణ. టీనేజ్ అమ్మాయిని కాను. మోసపోయిన కథలన్నీ నిత్యం వింటూన్నదాన్నే. ఆడపిల్ల ప్రేమని ఒక వినోదంగా మాత్రమే చూసే ధోరణి మగవాళ్లది. ఆమె 'తనకెంతో ప్రత్యేకం' అంటూ నేర్పుగా, బలంగా నమ్మకాన్ని కలిగించగలరు. అంతే ఘోరంగా మోసం చెయ్యగలరు. అదొక అనుభవం వాళ్లకి. అంతే.

చిన్నప్పట్నుంచీ మగపిల్లలతో కలిసి చదువుకున్నాను. వాళ్లను వేరుగా కాక నాతోటి వాళ్లుగానే చూసాను. హర్షని చూసినప్పుడు ..' ఒక్క క్షణం ఆగింది.

'... ఎందుకో తెలియని ఇష్టం కలిగింది. అతనూ నాపట్ల అంతే ఇష్టంగా ఉన్నాడని అనుకున్నాను. లంచ్‌కనో, డిన్నర్‌కనో కలుస్తుండేవాళ్లం. అతనితో జీవితం పంచుకోవాలని అనిపించింది. ఎప్పుడో మేమిద్దరం మాట్లాడుకున్నాక నీకూ, అమ్మానాన్నలకీ ఈ విషయం చెప్పాలని అనుకున్నాను. ఒక ట్రాన్స్‌లో ఉండేదాన్నేమో అప్పుడంతా.

అతను ఆర్థిక సమస్యలున్నాయని, కుటుంబ సమస్యలేవో ఉన్నాయని చెబుతుండేవాడు. అలాటప్పుడు 'నేను నీకు తోడుగా ఉన్నాను' అని చెప్పాలనిపించేది. సమస్యలు అన్నీ తీర్చేసి అతన్ని నిశ్చింతగా చూడాలని ఒక ఆలోచన కలుగుతుండేది తరచుగా. అతని పట్ల ఎందుకు అంత నమ్మకం, ప్రేమ కలిగాయంటే చెప్పలేను. మేము బయటకు వెళ్లిన ప్రతిసారీ అతను హుందాగా ప్రవర్తించేవాడు. అది నాకు అతని మీద మరింత నమ్మకాన్ని కలిగించింది. డబ్బుకి ఇబ్బంది పడుతున్నాడని తెలిసి రెండు లక్షలు లోన్ తీసుకుని అతనికి ఇచ్చాను. అందులో నాకు అభ్యంతరం ఏమీ కనిపించలేదు. అతను దాన్ని వెనక్కి ఇవ్వాలని కూడా అనుకోలేదు. ఎటూ అతనితో జీవితం పంచుకోబోతున్నదాన్ని, నా డబ్బు అతనిది కాదా అనిపించేది.

పెళ్లి ప్రస్తావన వచ్చినప్పుడు వాళ్ల ఇంట్లో ప్రేమ పెళ్లిళ్ల మీద సరైన అభిప్రాయం లేదని, తన అక్క విషయంలో అది విఫలమైందని ఎంతో మామూలుగా చెప్పాడు. అక్కడితో ఆగితే బావుండేది. పెళ్లి

> "ప్రత్యూ, ఆడపిల్ల తన వ్యక్తిత్వం నిలబెట్టుకోవాలి. దానిని తక్కువచేసే ఎవరినైనా, ఏ పరిస్థితినైనా ఎదిరించాల్సిందే. చదివిన చదువు, దానితో పాటు స్వంతకాళ్ల మీద నిలబడగలిగే శక్తి ఇచ్చే ఆత్మవిశ్వాసం అలా ఎదిరించే బలాన్నిస్తుంది. ఇకపైన నీ జీవితానికి నువ్వే కర్తవి. అవసరమైన నిర్ణయాలు నువ్వే తీసుకోగలగాలి. వెనుక మేము ఉన్నాం. కానీ అంతిమంగా నీ విచక్షణ నీకు మార్గదర్శి అవ్వాలి"

సాధ్యం కాదని చెబుతూ, 'స్నేహితుల్లా ఉండడానికేం ఇబ్బంది లేదులే. ముంబాయి లాటి చోట స్వేచ్ఛగా పెరిగినదానివి. మనం సన్నిహితంగా ఉండేందుకు పెళ్లే చేసుకోనక్కర్లేదు కదా' అన్నాడు తేలిగ్గా నవ్వుతూ. అదీ అతను నమ్మిన స్నేహం, స్వేచ్ఛ! స్వేచ్ఛగా ఉంటే అనైతికమే! కనీసం ఇప్పుడైనా అతనేమిటో అర్థం చేసుకునే అవకాశం దొరికిందని సంతోషించాను.

అతని నిర్వచనాలు నాకు అవమానకరంగా తోచాయి. నన్ను నన్నుగా మిగుల్చుకుందుకు ప్రయత్నించాను. ఘర్షణ తట్టుకోలేకే ఆరోజు ఆ పిచ్చిపని చేసాను. అమ్మమ్మ నేర్పిన ధైర్యం అంతా ఏమైపోయిందో! ఆవేశంలో ఎంత అనాలోచితంగా ప్రవర్తించానో తలుచుకుంటే నామీద నాకే కోపం వస్తోంది. ఆడపిల్ల చొరవగా మాట్లాడుతోందంటే ఆమె గురించి మగవాళ్లు తప్పుడు అభిప్రాయంలోనే ఉన్నారింకా. ఆమె ఆత్మవిశ్వాసం వారిని భయపెడుతుందేమో. అందుకే ఆడపిల్ల ప్రవర్తనకి నైతికతని అంటగట్టి చూస్తుంటారేమో! ప్రపంచమంతా విస్తరించిన ఈ సంకుచిత భావం ఇంత బలంగా ఎందుకుందో. దానిని ప్రతిఘటించే వేల గొంతులు ఇంత బలహీనంగా ఎందుకున్నాయో!'

అసలు నైతికత అనేది శరీరం, మనసు, ఆత్మ అన్నింటికీ సంబంధించిన ఒక ఉన్నతమైన సంస్కారం కాదూ?!"

ఎంత బాగా చెప్పింది కీర్తి! అవును, ఆమె నా స్నేహితురాలు!

•••

గమ్యం సమీపించినట్టుంది, రైలు వేగం తగ్గింది. బోగీలో సందడి మొదలైంది. బ్యాగ్ తీసుకుని లేచాను.

రచయిత్రి మెయిల్:
tukusgm@gmail.com

# స్పినాచ్... రుచి త్రీమచ్



## స్పినాచ్ పొటాటో పట్టీస్

**కావలసిన పదార్థాలు**

పాలకూర - 1 కట్ట, బంగాళ దుంపలు - 3, మైదా - అరకప్పు, ఉప్పు - రుచికి తగినంత, నూనె - వేగించడానికి సరిపడా.

**తయారుచేసే విధానం**

పాలకూర, బంగాళ దుంపలు విడివిడిగా ఉడికించి మెత్తగా మెదపాలి. ఒక పాత్రలో మైదా, ఉప్పు, బంగాళదుంప, పాలకూర గుజ్జు వేసి చపాతీ పిండిలా ముద్ద చేసుకోవాలి. చిన్న చిన్న వడల్లా వత్తుకొని నూనెలో దోరగా వేగించాలి. ఇష్టమైతే తగినంత అల్లం, పచ్చిమిర్చి తరుగు కూడా మైదాలో కలుపుకోవచ్చు. టమోటా కెచప్‌తో తింటే బాగుంటాయి.

## క్రీమ్డ్ స్పినాచ్

**కావలసిన పదార్థాలు**

ఆలివ్ నూనె - 2 టేబుల్ స్పూన్లు, పెద్ద ఉల్లిపాయ - 1, అల్లం - 2 అంగుళాల ముక్క, వెల్లుల్లి - 2 రేకలు, లేత పాలకూర - 2 కట్టలు, పంచదార - అర టీ స్పూను, జీలకర్ర - 2 టీ స్పూన్లు, గరం మసాల - 1 టీ స్పూను, మిరియాల పొడి - 1 టీ స్పూను, టమోటా - 1, పసుపు - అర టీ స్పూను, ఉప్పు - రుచికి తగినంత, కాచిన పాలు - ఒక కప్పు.



**తయారుచేసే విధానం**

కప్పు నీటిలో పాలకూర తరుగు, పంచదార వేసి 5 నిమిషాలు ఉడికించాలి. చల్లారాక బరకగా రుబ్బుకోవాలి. నూనెలో మెదిపిన వెల్లుల్లి, ఉల్లి, అల్లం తరుగు, జీలకర్ర, గరం మసాల, మిరియాల పొడి ఒకటి తర్వాత ఒకటి వేగించాలి. తర్వాత టమోటా తరుగు వేసి, మగ్గాక పాలు, పసుపు, ఉప్పు వేయాలి. చివరగా పాలకూర గుజ్జు వేసి రెండు నిమిషాల తర్వాత దించేయాలి. ఈ కర్రీకి బ్రెడ్ మంచి కాంబినేషన్.

## స్టఫ్ట్ స్పినాచ్ బాల్స్

**కావలసిన పదార్థాలు**

పాలకూర తరుగు - ఒకటిన్నర కప్పు, శనగ పిండి - అరకప్పు, పచ్చిమిర్చి తరుగు - 1 టీ స్పూను, నిమ్మరసం - అర టీ స్పూను, నీరు - అరకప్పు, పసుపు - చిటికెడు, ఉప్పు - అర టీ స్పూను, నూనె - వేగించడానికి సరిపడా. స్టఫింగ్ కోసం : పనీర్ తురుము - అరకప్పు, పచ్చిమిర్చి తరుగు, కిస్‌మిస్ తరుగు - 1 టీ స్పూను చొప్పున, ఎండుమిర్చి ముక్కలు - అర టీ స్పూను, ఉప్పు - పావు టీ స్పూను (ఇవన్నీ ఒక పాత్రలో కలిపి పెట్టుకోవాలి).

**తయారుచేసే విధానం**

ఒక పాత్రలో శనగపిండి, నిమ్మరసం, పసుపు, ఒక టేబుల్ స్పూను నూనె, ఉప్పు వేసి నీరు కూడా జతచేసి జారుగా కలిపి నాన్‌స్టిక్ పాన్‌లో 3 నిమిషాల పాటు చిక్కబడేవరకు అడుగంటకుండా వేగించాలి. మిశ్రమం గోరువెచ్చగా ఉండగానే పాలకూర, పచ్చిమిర్చి తరుగు కలిపి ముద్దలా చేసుకోవాలి. తర్వాత చిన్నచిన్న ఉండలు చేసుకొని వత్తుకుని మధ్యలో స్టఫింగ్ మిశ్రమం పెట్టి మళ్లీ బాల్స్‌గా చుట్టుకొని నూనెలో దోరగా వేగించాలి. ఈ బాల్స్‌కు పుదీనా చట్నీ మంచి కాంబినేషన్.



## ట్రయాంగిల్ చీజ్ క్రాకర్స్

**కావలసిన పదార్థాలు**

మైదా - 1 కప్పు, రవ్వ - అరకప్పు, ఉప్పు - రుచికి తగినంత, బేకింగ్ సోడా - పావు టీ స్పూను, బటర్ - 3 టేబుల్ స్పూన్లు, జీలకర్ర, ఎండుమిర్చి ముక్కలు, చీజ్ తురుము - అర టీ స్పూను చొప్పున, పాలకూర గుజ్జు - ముప్పావు కప్పు, నూనె - కాల్చడానికి సరిపడా.

**తయారుచేసే విధానం**

ఒక పాత్రలో మైదా, రవ్వ, ఎండుమిర్చి తరుగు, జీలకర్ర, బేకింగ్ సోడా, చీజ్ తురుము, ఉప్పు, పాలకూర గుజ్జు వేసి ముద్దలా తయారుచేసుకోవాలి. పదినిమిషాల తర్వాత మిశ్రమాన్ని 16 సమాన భాగాలు చేసుకుని చపాతీల్లా ఒత్తుకోవాలి. ఒక్కో చపాతీని నాలుగు భాగాలుగా త్రికోణంలో కట్ చేసుకుని పెనంపైన నూనెతో రెండువైపులా దోరగా కాల్చుకోవాలి. ఇవి గాలి దూరని డబ్బాలో వారం రోజులు నిలువ ఉంటాయి. సాయంత్రం స్నాక్స్‌గా బాగుంటాయి.



# బాలజ్యోతి

balajyothy

## చుక్కలు కలపండి

| | |
|---|---|
| onion | |
| patio | |
| pepper | |
| camera | |
| napkin | |
| veggies | |
| bookcase | |
| fireplace | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| f | i | r | e | p | l | a | c | e |
| e | i | h | c | a | m | e | r | a |
| s | x | n | l | x | o | e | v | r |
| a | p | a | g | i | n | o | e | e |
| c | g | p | a | t | i | o | g | p |
| k | v | k | v | v | o | l | g | p |
| o | s | i | r | p | n | q | i | e |
| o | r | n | i | p | c | i | e | p |
| b | r | w | a | p | z | a | s | d |

## ముందు'చూపు'తో గెలిచాడు

శ్రీకాంత్ బొల్ల... పుట్టుకతోనే కళ్లు లేవు. అయితే ఏంటి, ఆ లోపం అతని విజయానికి ఏ మాత్రం అడ్డంకి కాలేదు. చూపులేకపోయినా కష్టపడి 10+2 చదివాడు. సైన్స్ కోర్సుల్లో దృష్టి లోపాలు ఉన్న వారికి పెద్ద చదువులు చదివే అవకాశం లేకపోవడంతో, న్యాయ పోరాటం చేసి ఎమ్ఐటీ (మసాచుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ)లో సీటు సంపాదించాడు. ఎమ్ఐటీలో సీటు సంపాదించిన చూపులేని మొదటి విద్యార్థి శ్రీకాంతే. చదువు పూర్తయిన తర్వాత హైదరాబాద్‌లో 'బ్రెయిలీ ప్రింటింగ్ ప్రెస్'ను స్థాపించి, తర్వాత 'బొల్లంట్ ఇండస్ట్రీస్' అనే కంపెనీని స్థాపించాడు. తనలాంటి వారెందరికో ఇక్కడ ఉపాధి కల్పిస్తున్న శ్రీకాంత్ కంపెనీ విలువ ఇప్పుడు 50 కోట్ల రూపాయల పైమాటే!

## దారి చూపించండి

## విలువ ఎంత?

🍎 + 🍎 + 🍎 = 🍏 + 🍏 + 1

🍎 + 2 = 🍏

🍏 = ?

సూర్యుడికి చాలా డిగ్రీలున్నాయి అందుకే స్కూలుకెళ్లడు

## జవాబులు

**విలువ ఎంత?** 7

**తేడాలు కనుక్కోండి:** ఎడమవైపు పై కొమ్మ చివర సీతాకోకచిలుక, కింది కొమ్మ మీద రెండే ఉడతలున్నాయి, పక్కన కప్ప లేదు, ముంగిసకు ఒక పన్ను లేదు, ఎర్ర పిట్ట వ్యతిరేక దిశలో తిరిగి ఉంది, కుడివైపు రెండు కొంగల్లో ఒకటి వ్యతిరేకదిశలో చూస్తోంది, వాటి పక్కన చిన్న పురుగు లేదు.

## రంగులు వేయండి



## కొమ్ములున్న కూత పక్షి



ముక్కుపైన గొట్టంలా కొమ్ము ఉన్న ఈ పక్షి పేరు ట్రంపెటర్ హార్న్‌బిల్ (trumpeter hornbill ). ఈ కొమ్ము చూసేందుకు ట్రంపెట్ వాయిద్యంలాగా ఉండడంతో దీనికా పేరు వచ్చింది. దక్షిణాఫ్రికా పరిసర ప్రాంతాలలో ఉండే ఈ పక్షులను అక్కడి ప్రజలు ఇంట్లో పెంచుకుంటారు కూడా. పండ్లు, పెద్ద కీటకాలను ఆహారంగా తీసుకునే ఇవి చాలా తెలివైనవి. మనుషుల దగ్గరి నుంచి ఎన్నో విషయాలను అతి సులువుగా నేర్చుకుంటాయి. గుంపులు, గుంపులుగా తిరిగే ఈ పక్షులు 20 ఏళ్ల దాకా జీవిస్తాయి. ఆడపక్షుల కొమ్ము చాలా చిన్నగా ఉండి, స్పష్టంగా కనిపించదు. మగ పక్షుల కంటే ఆడపక్షులు చిన్నగా ఉంటాయి. దట్టమైన పచ్చిక అడవుల్లో ఒకప్పుడు విరివిగా కనిపించిన హార్న్‌బిల్ పక్షులు ఇవి, ఇప్పుడు అంతరించిపోయే స్థితిలో ఉన్నాయి.

## ఓపిక - బలం!

ఒక ఊళ్లో ఒక పందికి మూడు పిల్లలు ఉన్నాయి. అవి పెరిగి, పెద్దవడంతో బయటికి వెళ్లి, సొంతంగా ఇల్లు కట్టుకొమ్మని చెప్పింది వాటి తల్లి. 'చేసే పనికి ఫలితం రావాలంటే కొంచెం ఓపిక అవసరం' అని సలహా ఇచ్చింది.

మూడు పంది పిల్లల్లో సోమరిదైన పెద్దది, త్వరగా పూర్తవుతుందనే ఉద్దేశంతో గడ్డిపరకలతో గుడిసె వేసుకుంది. రెండో పిల్ల పంది, కర్రలను సేకరించి చిన్న ఇల్లు కట్టుకుంది. రెండింటి కంటే చిన్నదైన మూడో పంది చాలా ఓపికగా ఇటుక, ఇటుకా పేరుస్తూ... దృఢంగా పక్కాఇల్లు నిర్మించింది. ఇలా ఉండగా, ఓ రోజు అక్కడికి ఒక టక్కరి నక్క వచ్చింది. మొదటి పంది ఇంటికి వెళ్లి, గడ్డినంతా పీకేసింది. భయంతో ఆ పంది పిల్ల, రెండో దాని ఇంటికెళ్లి దాక్కుంది. నక్క అక్కడకు కూడా వెళ్లి, కర్రలను లాగి పడేసింది. దీంతో రెండు పందులూ, మూడో పంది ఇంట్లో దాక్కున్నాయి. చిమ్నీ ద్వారా నక్క లోపలికి వస్తుందని ముందుగానే గ్రహించింది తెలివైన మూడో పంది. చిమ్నీ కింద ఒక పొయ్యి పెట్టి, నీళ్లు పోసి మరిగించింది. చిమ్నీ ద్వారా ఇంట్లోకి దూకిన నక్క ఆ వేడి నీటిలో పడింది. ఆ వేడికి ఒళ్లు కాలి, తట్టుకోలేక కేకలు వేస్తూ బయటికి పరుగులు పెట్టింది. చిన్నదాని సమయస్ఫూర్తిని మిగతా రెండూ మెచ్చుకున్నాయి. అది ఓపికతో పక్కా ఇల్లు కట్టడం వల్లే తమ ప్రాణాలు నిలిచాయని ఎంతగానో పొగిడాయి.

పిల్లలూ... మీరు కూడా ఏదైనా పని చేసేటప్పుడు ఓపికగా చేయాలి. అలాకాకుండా కంగారు పడినా, తొందర పడినా ఆ పనిని సరిగ్గా పూర్తిచేయలేరని గుర్తుంచుకోండి.



## తేడాలు కనిపెట్టండి?



# సమోసా నిషిద్ధం!

**‘అ**రె ఓ మియా... మై నే క్యా కియా’ అని ఆర్తిగా అడుగుతోంది సమోసా! అయ్యయ్యో... అంత పెద్ద కష్టం ఏమొచ్చిందా... బుజ్జి సమోసాకి! అని ఆలోచిస్తున్నారా... అవును, చాలా పెద్ద సమస్యే వచ్చింది. “చూడ్డానికి చక్కగా లేవనీ, నిన్ను చూస్తే కోపం వస్తోందనీ... నీ రూపం అన్యమత చిహ్నంలా ఉందనీ’ సమోసాపై నిషేధం విధించారు సోమాలియా దేశంలో. అక్కడ ‘అల్-సహాబ్’ అనే తీవ్రవాద సంస్థకు సమోసా అంటే మా చెడ్డ చిరాకు! ‘అన్యమతానికి ప్రచారం కల్పించేలాగా ఉన్న త్రిభుజ చిహ్నాన్ని లొట్టలేసుకుని తింటున్నారా?’ అంటూ ప్రజలను నిలదీసి, “ఇకపై సోమాలియాలో ఎక్కడా ‘సమోసా కర్నా... ఖానా బంద్” అని జీపులెక్కి, లౌడ్ స్పీకర్లలో ప్రజలకు హెచ్చరిక జారీ చేశారు. ప్రభుత్వం చెబితే పర్లేదులే... అని ప్రకటనను పక్కన పెట్టేసి, హాయిగా లాగించేవారే. కానీ చెప్పింది మెషీన్ గన్లు పట్టుకున్న మిలిటెంట్లు. దాంతో సమోసా పేరు చెబితేనే జడుసుకుంటున్నారు జనాలు.

## చరిత్ర చిన్నది కాదు...

దాదాపు వెయ్యేళ్ల చరిత్ర ఉంది సమోసాలకు. అప్పుడెప్పుడో క్రీ.శ. 995లోనే ‘అబుల్‌ఫాజీ బేహకీ’ అనే ఇరానీ చరిత్రకారుడు తన జీవిత చరిత్రలో మొట్టమొదటిసారిగా సమోసా వైభవాన్ని వర్ణించాడట. పద మూడో శతాబ్దంలో భారతదేశానికి వచ్చిందీ సమోసా. మహ్మద్‌బీన్ తుగ్లక్, మధ్యాహ్న భోజనంలో సమోసా తప్పక ఉండాల్సిందేనట. సమోసాను అప్పట్లో ‘సమూషక్’ అనీ, ‘సంబూషక్’ అనీ పిలిచేవారు. సోమాలియాలో ఇప్పటికీ ఈ పేర్లతోనే వ్యవహరిస్తున్నారు.

## ఆ రుచులకు లెక్కే లేదు...

నూనెలో దోరగా వేయించిన పచ్చిమిర్చిని నంజుకుని తినే ఆలూ సమోసా, క్యాబేజీ కూరను కుక్కి చేసే చిన్న సమోసా తెలుగు రాష్ట్రాల్లో పల్లెపల్లెలో కనిపించేవే. ఇవే కాకుండా క్యారెట్ సమోసా, పనీర్ సమోసా, వెజ్ సమోసా, చికెన్ సమోసా, మటన్ సమోసా, చాకొలెట్ సమోసా, కీమా సమోసా, మష్రూమ్ సమోసా, స్వీట్‌కార్న్ సమోసా, ఛీజ్ సమోసా, స్వీట్ సమోసా... ఒకటా రెండా సమోసాల్లో ఎన్ని రకాలో లెక్కేసి చెప్పడం అసాధ్యం. బరువును పెంచుతుందనే నిందను తప్పించుకోడాని కి ఇప్పుడు.... రాగి సమోసా, డైట్ సమోసా, బేక్డ్ సమోసా వగైరా ‘లో కెలోరీ’ అవతారాలూ ఎత్తుతోంది చిట్టి సమోసా. గుజరాతీ దాబాల్లో ‘సమోసా ఛాట్’, ముంబయి వీధుల్లో ‘సమోసా పావ్‌బాజీ’... పంజాబీ వీధుల్లో ‘స్పెషల్ స్వీట్ సమోసా’... మొత్తంగా ఇదో ‘ఆలిండియా ఫుడ్’గా అవతరించింది. ఎక్కడ నుంచి వచ్చింది, ఏ దేశం నుంచి తెచ్చింది? అనే పట్టింపు లేకుండా సమోసాలు అంటేనే ‘ఆహా...’ అంటూ ఒక పట్టు పట్టేస్తాం మనం. సోమాలియా సోదరులను మాత్రం ఆ రుచులకు దూరం చేయడం... మోసం, సమోసం!



## ఈ వారం కవిత




**వి**చ్చిన గొడుగులాటి
అందమైన రెండు రెక్కలు విప్పి
ఆకాశంలో ఎగిరే పిట్టల్ని చూసినపుడు
ఆనంద కేతనాలు ఈ పక్షులని భ్రమిస్తాము
నిరంతర ఒత్తిళ్ల
నిత్య తలనొప్పుల ఊడిగపు కొలువుల నరకాలక్షణాల
ప్రకృతి చెలికత్తెతో చెలిమిగీతం పాడే
రైతు బతుకెంత నిత్య నూతనమని భావిస్తాము
అకాల వర్షాలు, అప్పుల ముప్పులతో
వ్యవసాయమే జూదమైనపుడు
గుండె చెట్టును అల్లుకొన్న దిగులు తీగను పెకలించి
పిట్టలైనా మనుషులైనా వలసగీతాలు కాక తప్పదు కదా!
పుట్టిన దగ్గరనుంచి
మట్టివాసనతో మమేకమైనా
పాలపిట్టలు వాలే పంట చేలతో సరాగమాడినా
ఊరందరితో ఆత్మీయ బంధాలు పెనవేసికొన్నా
నిత్య హరిత దృశ్యం పచ్చని పొలం ఎడారి ఐనపుడు
హృదయంలేని లోహ నగరాలకు వలస వెళ్లక తప్పదు
ఎడతెగని మంచువానల నుంచి తప్పించుకొని
గుప్పెడు గింజల కోసం
ఖండాలకు ఆవల
ఎక్కడనుంచో ఇక్కడకు వచ్చి
ఆకాశం రంగస్థలం మీద
లక్షల పక్షులు ఎగిరే సుందర దృశ్యం మాటున
నొప్పి పుట్టేలా ఎగిరే
రెక్కల మాటున అంటుకొన్న
కన్నీటి జీర కనిపించదెవరికీ
పిట్టలకైనా మనుషులకైనా
వలస పోవడమంటే
ఒక నిరంతర దుఃఖ జ్వాలనమే

**- మందరపు హైమవతి, 94410 62732**

# వారికోసిల్, పైల్స్ ఇక బాధించవు

**వారికోసిల్** 10 నుంచి 15 శాతం పురుషుల్లో వారికోసిల్ ఉండే అవకాశం ఉంటుంది. వారికోసిల్ అంటే పురుషుల్లో బీజం వద్ద సిరల సముదాయం వాచి, ఉబ్బి పోతాయి. ఇది ఎక్కువగా ఎడమవైపు వస్తుంది. దీనికి కారణం ఎడమ వైపు ఉండే సిరల సమూహాల్లో వాల్వ్ వ్యవస్థ సరిగ్గా ఉండకపోవడమే.

**అయితే ఏమిటి?**

దీనివల్ల సంతానోత్పత్తికి పనికి వచ్చే సెల్స్ పుట్టుక పెరుగుదలలో లోపాలు వస్తాయి. కాడ్మియమ్ పెరుగుతుంది. డీఎన్ఏ ఫ్రాంగ్మేటేషన్ పెరుగుతుంది. వీటివల్ల వీర్యకణాల కదలికలు 60 శాతం తగ్గిపోతాయి. ఎల్‌హెచ్/ఎఫ్ఎస్‌హెచ్ హార్మోన్స్ పెరుగుతాయి.

**నిర్ధారణ :** వాపు, ఉబ్బి ఉండే బీజకోశాన్ని పరీక్షించడం ద్వారా గుర్తించవచ్చు.

**రకాలు**

గ్రేడ్ 1 : వాల్‌సల్వ మనెవుర్ ద్వారా నొక్కిపడితే తెలుస్తుంది.

గ్రేడ్ 2 : వాల్‌సల్వ మనేవుర్ లేకుండా తెలుస్తుంది.

గ్రేడ్ 3 : చూడగానే కన్పిస్తుంది.

చాలాకాలంగా బాధపడే వారిలో బీజకోశం దెబ్బతినే అవకాశం ఉంది. దానివల్ల శాశ్వతంగా పిల్లలు కలిగే అవకాశం కోల్పోతారు.

**చికిత్స :** ఆపరేషన్ ద్వారా ఐఎస్‌యూ రిపేర్ చేసి ఇతర సిరలకు అనుసంధానం చేయవచ్చు.

**వారికోసిల్ ఎంబోలైజేషన్ :** ఏంజియోప్లాస్టిక్ క్యాథెటర్ ద్వారా సిరలు బ్లాక్ చేస్తారు. అయితే ఈ చికిత్స ఖరీదైనది.

**హోమియోట్రెండ్స్ చికిత్స**

వ్యాధిమూలాలకు చికిత్స అందించడం జరుగుతుంది. దీనివల్ల వీర్యకణాల సంఖ్య పెరుగుతుంది. కదలికలు పెరుగుతాయి. ఎలాంటి దుష్ఫలితాలు ఉండవు.

**డాక్టర్ టి.ప్రభాకర్, MD హోమియో**
MS సైకాలజీ & కౌన్సెలింగ్,
పీజీ డిప్లొమా ఇన్ సెక్సాలజీ
బెస్ట్ డాక్టర్ 2016, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 3000 , 77 3000 4000



**పైల్స్** మలాశయం ద్వారం వద్ద లోపల ఉబ్బి, నొప్పిని కలగజేసే సిరలను పైల్స్ అంటారు. ఇందులో ఇంటర్నల్‌పైల్స్, ఎక్స్‌టర్నల్‌పైల్స్ అని రెండు రకాలుంటాయి.

**ఇంటర్నల్‌పైల్స్ :** లోపల ఉంటాయి. మల విసర్జన సమయంలో నొప్పి, బాధ, రక్తం పడుతుంది. బాధ వస్తూపోతూ ఉంటుంది.

**ఎక్స్‌టర్నల్‌పైల్స్ :** మలద్వారం వద్ద దురద నొప్పి, గడ్డలుగా అనిపించుట, వాపు, మలంలో రక్తం పడటం వంటి లక్షణాలుంటాయి.

**కారణాలు :** ఎక్కువ శాతం మలబద్ధకం వల్ల వస్తుంది. ఎక్కువ విరేచనాలు అయ్యే వారిలోనూ ఉంటుంది. నీళ్ల తక్కువగా తాగడం, పీచు పదార్థాలు తక్కువగా తినడమూ కారణమే. గర్భిణిలు, పాలిచ్చే తల్లుల్లోనూ ఈ సమస్య ఉంటుంది.

**నిర్ధారణ :** ప్రొక్టోస్కోపి, వేలిపరీక్ష, కొలనోస్కోపి, సిగ్మాయిడోస్కోపి, ఎరోస్కోపి వంటి పరీక్షలు అవసరమవుతాయి.

**జాగ్రత్తలు:** ఎక్కువ ఒత్తిడి లేకుండా మల విసర్జన జరిగేలా చూసుకోవాలి. పీచుపదార్థాలు ఎక్కువగా తీసుకోవడం, పండ్లు, మొలకెత్తిన గింజలు తినడం చేయాలి. ఒత్తిడి లేకుండా మలవిసర్జన అయ్యేలా చూసుకోవాలి.

**హోమియోట్రెండ్స్‌లో చికిత్స**

వ్యాధి మూలాలు శోధించి కారణం నివారించవలెను. ఆహారపు అలవాట్లు, సలహాలు ఇవ్వబడును. హోమియో మందులతో పైల్స్ సమస్య శాశ్వతంగా పోతుంది. ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్‌లు ఉండవు.

# పురుషుల్లో సంతానలేమికి సహజమార్గం

**సంతానలేమి అంటే... :** దంపతులు ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకుండా శృంగార జీవితం గడిపినప్పటికీ సంతానం కలగనట్లయితే సంతానలేమి ఉన్నట్లుగా భావించాలి. సంతానలేమికి పురుషుల్లో 40 శాతం కారణాలుంటాయి. స్త్రీలలో కూడా అంతే శాతం కారణాలుంటాయి. 20 శాతం మందిలో ఎటువంటి కారణాలు కనిపించవు.

**పురుషుల్లో సంతానలేమి**

పురుషుల్లో సంతానలేమి సమస్యకు ముఖ్యకారణం వీర్యకణాల లోపాలే.

**వీర్యకణాల ఉత్పాదన :** వీర్యకణాలు వృషణాల్లో ఉత్పత్తి అవుతాయి. ఈ కణాలు ఉత్పత్తి కావడానికి మెదడులోని పిట్యూటరీ గ్రంధి నుంచి వెలువడే ఎఫ్ఎస్‌హెచ్ అనే హార్మోన్, వృషణాల్లో వెలువడే టెస్టోస్టిరాన్ హార్మోన్ ప్రముఖ పాత్రపోషిస్తాయి. సాధారణంగా పురుషుల్లో 20 మిలియన్లు లేక అంతకన్నా ఎక్కువ వీర్యకణాలు ఉండాలి. వాటిలో కదలికలు 70 శాతం ఉండాలి. ఆకృతి 70 శాతం ఉండాలి. అప్పుడు దానిని ఫెర్టైల్ సెమన్ అంటారు.

**వీర్యకణాల సమస్యలు-రకాలు**

పురుషుల్లో వీర్యకణాల సమస్యలను కింది విధంగా విభజించవచ్చు.

**1) ఎస్పెర్మియా :** ఈ సమస్య ఉన్న వారిలో వీర్యం ఉత్పత్తి కాదు.

**2) అజూస్పెర్మియా :** వీర్యం ఉంటుంది. కానీ వీర్యకణాలు ఉండవు.

**3) ఆలిగోస్పెర్మియా :** వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉంటుంది.

**4) అస్థినోస్పెర్మియా :** వీర్యకణాల కదలిక లేక చురుకుదనం తక్కువగా ఉంటుంది.

**5) టెరటోస్పెర్మియా :** వీర్యకణాల ఆకృతి సరిగ్గా లేకపోవడాన్ని టెరటోస్పెర్మియా అంటారు. కొంతమందిలో ఆలిగో, అస్థినో, టెరటోస్పెర్మియాలు కలిసి ఉండవచ్చు.

**వీర్యకణాల లోపానికి కారణాలు**

**హార్మోన్ల లోపం :** వీర్యకణాల ఎదుగుదలకు అవసరమైన హార్మోన్స్ (ఎఫ్ఎస్‌హెచ్, ఎల్‌హెచ్, టెస్టోస్టిరాన్)లోపం వల్ల సమస్య రావచ్చు.

**వీర్యకణాల ఎదుగుదల లేకపోవడం :** పైన చెప్పిన విధంగా వీర్యకణాల ఎదుగుదలలో ఏదైనా కారణం చేత ఎదుగుదల ఆగిపోతుంది.

**ఇతర కారణాలు:** చాలా మందిలో వెరికోసిల్ సమస్య వీర్యకణాల లోపానికి కారణమవుతుంది. పొగతాగడం, డ్రగ్స్, మద్యం సేవించడం, కొన్ని రకాల మందులు, ఊబకాయం, థైరాయిడ్ సమస్యలు, మధుమేహం,క్రోమోజోముల సమస్యలు, వీర్యం బయటకు వచ్చే నాళాల సమస్యలు, గనేరియా, సిఫిలిస్, హెర్పిస్ వంటి సుఖవ్యాధులు కారణమవుతాయి. ఎక్కువగా వేడిగా ఉండే వాతావరణంలో పనిచేయడం, తిరగడం, బిగుతుగా ఉండే లోదుస్తులు ధరించడం కూడా కారణమవుతుంది. ఒక్కోసారి ఏ కారణం తెలియకుండా వీర్యకణాల లోపం రావచ్చు.

**హోమియో చికిత్స**

హోమియో వైద్యంలో వీర్యకణాల సమస్యలకు అత్యుత్తమ మందులు ఉన్నాయి. మొదట వీర్యకణాల సమస్య ఉందని తెలియగానే ఇబ్బంది పడటం సహజమే. కానీసమస్య మరింత జటిలం కాకముందే అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదించడం ద్వారా సంతానం కలిగేలా చేసుకోవచ్చు. హోమియో వైద్యం హోలిస్టిక్ విధానాన్ని నమ్ముతుంది. వ్యాధి లక్షణాలతో పాటు వ్యక్తి మానసిక, శారీరక లక్షణాలు, ధర్మాలను పరిగణలోకి తీసుకుని అత్యంత సహజమైన మందులతో ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా ఫలితాలు పొందవచ్చు. సంతానలేమి ఉన్నప్పుడు కుంగిపోకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా సంతానసాఫల్యం అయ్యేలా చూసుకోవచ్చు.

**డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు**
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 1000, 77 3000 2000



## సౌమ్యవాదమే బలివాడ ఎజెండా

వాస్తవికతకి కల్పన జోడించి కథను మలచడంలో బలివాడ కాంతారావు చెయ్యితిరిగినవారు. ఆయన ఉద్యోగ రీత్యా వివిధ ప్రాంతాల్లో ఉండటం వలన కథాంశాలు ఒక్క కళింగాంధ్రకే పరిమితం కాకుండా దేశమంతా విస్తరించాయి. మంచితనం పట్ల అపారమైన నమ్మకం. సంస్కృతి, మతం, సంప్రదాయాలంటే గౌరవం. రాజకీయాలంటే సుతరామూ గిట్టవు కాబట్టే ఆయన కథల్లో సామ్యవాదానికి బదులు సౌమ్యవాదమే బలంగా వినిపిస్తుంది.

మధ్యతరగతి సంక్లిష్ట జీవితం, మానవత్వం, వేదన, జీవిత సత్యాల ఆవిష్కరణ, దౌర్జన్య వ్యతిరేకత ఆయన కథలకు ముడిసరుకు. కాంతారావు పేరువినగానే వెంటనే గుర్తుకొచ్చే కథ 'ముంగిస కథ'. ముంగిస కూడా పెంపుడు జంతువే అని ఈ కథ చదివే వరకూ మనకు తెలియదు. తన మేనమామ ఇంట్లో మువ్వల శబ్దంతో తిరుగాడే ముంగిసను చూసి, ఆ అనుభవానికి కొంత కాల్పనికత జోడించి చదువరి గుండె పెంకులు ఎగరగొట్టేలా కథ రాశారు. అలాగే బొంబాయిలో ఉండగా తన ఆధీనంలోని ఒక తాగుబోతు ఉద్యోగి ప్రవర్తననూ, చివరకు అతనిలో తాను కలిగించిన పరివర్తననూ 'మనిషి - పశువు' కథగా మలిచి మనల్ని ఏడిపిస్తారు. ఇలా చెప్పుకుంటూ పోతే వందల కథలున్నాయి. ఈ కథలు చదివిన తర్వాత ఏ పాఠకుడైనా ఒకసారి ఆలోచించగలిగితే తన శ్రమ ఫలించినట్లే అంటారు కాంతారావు. ఆలోచించడం ఒక్కటే కాదు, మానసికంగా కూడా పరివర్తన తీసుకురాగలిగే గొప్ప సుగుణం సైతం ఈ కథలకు ఉందని ఒప్పుకుంటారు.

**- గొరుసు**




**బలివాడ కాంతారావు కథాకలశం**
**సంపాదకుడు :** పి. రాజేశ్వరరావు
**పేజీలు :** 680, **వెల :** రూ.450
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

కొత్త పుస్తకాలు

## పసిడి తెర జిలుగుల వెనక...

సినిమాని కేవలం వ్యాపారంగా చూసేవాళ్లు ఆర్థిక ప్రయోజనాలే ప్రధానంగా సినిమాలు తీస్తుంటారు. అలా తీసేవాటిలోనూ ఎంతో కొంత కళ లేకుండా పోదు. అందుకే 'పసిడి తెర'లో కనిపించే వంద సినిమాల్లో మనకు కళాఖండాలనదగ్గ చిత్రాలతో పాటు పక్కా వాణిజ్య విలువలతో తీసిన సినిమాలూ ఉన్నాయి. విజయా ప్రొడక్షన్స్ సంస్థ వారే ఈ పుస్తకాన్ని ప్రచురించడాన్ని బట్టే దీని విలువ ఏమిటనేది అర్థమవుతుంది. తొలి తెలుగు చిత్రం 'భక్త ప్రహ్లాద' మొదలుకొని 'హృదయాంజలి' చిత్రం వరకూ 'అవార్డులు, రివార్డులు అందుకున్న 100 విజయవంతమైన చిత్రాల విశేషాలే ఈ పుస్తకం. అయితే మొదటే చెప్పుకొన్నట్లు ఈ పుస్తకంలో చోటుపొందిన సినిమాలన్నీ గొప్పవి కావు. విషయపరంగా విమర్శకు నిలవని సినిమాలు చాలానే ఉన్నాయి. అయినప్పటికీ ఆ సినిమాలు ఎలా రూపొందాయనే విషయాన్ని ఆసక్తికరంగా చెప్పాలని ప్రయత్నించారు రచయిత. 'మూగమనసులు', 'ముత్యాల ముగ్గు', 'మరో చరిత్ర', 'ఈనాడు', 'శ్రీమద్విరాట్ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర', 'అర్ధరాత్రి స్వతంత్రం', 'కళ్లు', 'రుద్రవీణ', 'దాసి', 'గీతాంజలి', 'మాతృదేవోభవ' వంటి సినిమాల రూపకల్పన జరిగిన తీరు, తెరవెనుక విశేషాలు చదువుతుంటే చక్కని సినిమాలు తీయడంలో ఉండే సాధకబాధకాలు తెలుస్తాయి.

**- యజ్ఞమూర్తి**




**పసిడి తెర**, పులగం చిన్నారాయణ
**పేజీలు:** 512, **వెల:** రూ.350
**ప్రతులకు:** విజయా పబ్లికేషన్స్, 044 - 2365 2007

## అన్నదాతలకు అంకితమైన 'వేదం'

ఈ పుస్తకాన్ని చదువుతుంటే రైతు నేస్తం ఫౌండేషన్ ఛైర్మన్ వై.వేంకటేశ్వరరావుకు సేంద్రియ వ్యవసాయంపై ఉన్న మమకారం ఇట్టే అర్థమవుతుంది. చివరకు ఇష్టంగా తినే మామిడి పండును సైతం కృత్రిమ రసాయనాలతో నాశనం చేస్తున్నారని ఆవేదన చెందుతున్న తరానికి సమాధానం దొరికినట్టు అనిపిస్తుంది. హద్దూ అదుపూ లేని రసాయన ఎరువుల వినియోగంతో భూ సారాన్ని నాశనం చేస్తున్నారంటూ సంప్రదాయ శాస్త్రజ్ఞులు చేస్తున్న ఆందోళనకు ఓ పరిష్కారం దిశగా అడుగుపడిందని తోస్తుంది. రసాయన రహిత సాగుకు పలు ప్రాంతాల్లో పడుతున్న పునాదులకు ఊతమిచ్చే విధంగా ఈ పుస్తకాన్ని రూపొందించారంటే అతిశయోక్తి కాదు. పంటల్ని సంప్రదాయ పద్ధతుల్లో ఎలా పెంచవచ్చో చెబుతూ, సేంద్రియ ఎరువుల తయారీని ప్రత్యేకంగా పొందుపరిచారు. రైతులకు అర్థమయ్యే విధంగా చిన్న చిన్న పదాల వాక్య నిర్మాణం ఆకట్టుకునేలా ఉంది.

**- మద్దిపట్ల మణి**




**స్వేదవేదం**, సంకలనం: ప్రొ. కొసరాజు చంద్రశేఖరరావు
**పేజీలు:** 335, **వెల:** రూ.300, **ప్రతులకు:** 9676797777

## ఒకే మూలసూత్రం- రెండు వ్యక్తీకరణలు

జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి రాసిన 'వలసదేవర', 'జంగమదేవర' - ఒకే తాత్విక సూత్రానికి రెండు విభిన్నమైన వ్యాఖ్యానాలు. వలస కాల/పరిపాలనానంతర యాభై ఏళ్ళ కాలంలో చిత్తూరు జిల్లాలోని ఓ గ్రామంలో సంభవించిన సంక్షోభాన్ని ఆసక్తికరంగా నవలీకరించాడు. నిజానికి ఈ నవలా కథనం ఒక ప్రాంతానికి పరిమితమైనా ఆ కాలంలో మొత్తంగా భారత గ్రామీణ జీవన పతన, విధ్వంస విధానాన్ని ఒక బైరాగిలా గానం చేస్తాడు. జంగమాత్మక ప్రపంచ అనుభూతిని వైయక్తిక అనుభవంలో దర్శింపజేసే నవల 'జంగమ దేవర'. ఇంట్లో నుంచి పారిపోయిన కుర్రాడి అనుభవాలు, జ్ఞాపకాలు స్కెప్టికల్ ధర్మాధర్మ విచక్షణ తాలూకు సందేహాలు ఈ నవల కథన సారాంశం. ఈ రెండు నవలలూ అహమూ పరమూ అని రెండుగా కనిపించే ఒకే మూలసూత్రపు రెండు వ్యక్తీకరణలు. ఈ రెండింటికీ అందమైన ముఖచిత్రాలనిచ్చాడు భావన బ్రహ్మం.




**- డి. లెనిన్**




**వలసదేవర**
**పేజీలు :** 320, **వెల :** రూ.150
**జంగమదేవర**
**పేజీలు :** 368, **వెల :** రూ.200
జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి
**ప్రతులకు :** 94400 37258

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'రుమటాయిడ్ ఆర్థరైటిస్' సమస్యకు సరైన వైద్యం



**డా. శ్రీకాంత్ మోర్లావర్**
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ఈ మధ్యకాలంలో చాలా మందిని వేధిస్తున్న ఆరోగ్య సమస్యల పరిశీలన పరంగా - ఆటో ఇమ్యూన్ వ్యాధులు చాలా ఎక్కువ మందిలో కనిపిస్తున్నట్లు వివిధ గణాంకాల ద్వారా వెల్లడి కాబడింది. అందునా రుమటాయిడ్ ఆర్థరైటిస్ వ్యాధితో బాధపడేవారి సంఖ్య అధికంగా ఉంటోంది. ఈ వ్యాధి యొక్క ప్రభావం - శరీరంలోని వివిధ కణజాలాలపైన మరియు ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, హృదయం, చర్మం వంటి ప్రధాన అవయవాలపై ఉన్నప్పటికీ, ముఖ్యంగా కీళ్ళ (సైనోవియల్ జాయింట్స్) పై ఎక్కువగా ఉంటుంది.

ఆటో ఇమ్యూన్ వ్యాధులనగా మనల్ని వ్యాధులకు గురికాకుండా కాపాడే మన రోగనిరోధక వ్యవస్థ కొన్ని అసమతుల్యతల కారణంగా పొరబడి, సొంత కణాలపైనే దాడి చేయడం. వీటికి ఇతర వైద్య విధానాలలో పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కానీ కాన్‌స్టిట్యూషనల్ హోమియోవైద్య విధానం ద్వారా ఈ ఆటో ఇమ్యూన్ వ్యాధులను సంపూర్ణంగా నయం చేయవచ్చు.



ఏ వయస్సు వారినైనా ప్రభావితం చేసే ఈ వ్యాధి ముఖ్యంగా 30 నుండి 60 సంవత్సరాల మధ్య వయస్సు గలవారిని ఎక్కువగా ప్రభావితం చేస్తుంది. పురుషుల కంటే స్త్రీలలో 3 రెట్లు అధికంగా ఈ వ్యాధి కలుగుతుంది. 16 సం॥ లోపు వయస్సు గల వారిలో ఈ వ్యాధి కలిగితే, దానిని జువైనల్ రుమటాయిడ్ ఆర్థరైటిస్ అని అంటారు. ఈ వ్యాధి ముఖ్యంగా కీళ్ళలోని సైనోవియం పొరను శోథమునకు గురి చేసి, తద్వారా క్రమంగా కీళ్ళలోని ఎముకలను, వాటి తాలూకు కార్టిలేజ్‌ని కూడా దెబ్బతీస్తుంది. ఫలితంగా కీళ్ళు - వాటి ఆకారం, అమరికను కోల్పోయి, విపరీతమైన నొప్పితో పాటు కీళ్ళ కదలికలు కష్టతరంగా మారుతాయి. ఈ పరిస్థితి దీర్ఘకాలికంగా కొనసాగితే అది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి, కీళ్ళ వైకల్యానికి గురిచేస్తుంది. కాబట్టి ఈ వ్యాధిని మొదట్లోనే గుర్తించి, వెంటనే వైద్యం అందించటం ఎంతో అవసరం.

**కారణాలు:** ఈ వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియలేదు. కానీ ఈ వ్యాధి కలిగిన కుటుంబ చరిత్ర, పొగ త్రాగటం, అధిక బరువు, వాతావరణ మార్పుల వంటి అంశాల వలన ఈ వ్యాధికి గురి అయ్యే అవకాశం ఉంటుంది. • 'రుమటాయిడ్ ఆర్థరైటిస్'తో బాధపడే వారిలో 80% వరకు 'రుమటాయిడ్ ఫ్యాక్టర్' అనే యాంటీబాడీని కలిగియున్నారు.

**లక్షణాలు:** ఈ వ్యాధికి గురి అయిన కీళ్ళలో - వాపు, నొప్పి మరియు చేతితో తాకితే వేడిగా అనిపించడం, ఉదయాన్నే నిద్ర లేవగానే కీళ్ళు బిగుసుకుపోవడం • శరీరంలోని ఇరు పార్శ్వాలలో ఉండే ఒకే రకమైన కీళ్ళను ప్రభావితం చేయడం ఈ వ్యాధి యొక్క ముఖ్య లక్షణం. • ఈ వ్యాధి మొదట - చిన్న కీళ్ళు అయిన చేతివ్రేళ్ళు, కాలివ్రేళ్ళను మరియు వ్యాధి తీవ్రత పెరిగే కొద్దీ - మణికట్టు , మోచేతులు, భుజాలు, మోకాళ్ళు, తుంటి మరియు చీలమండల వంటి కీళ్ళను ప్రభావితం చేస్తుంది. • కీళ్ళ ప్రాంతంలోని చర్మం క్రింద ఫైబ్రస్ కణజాలం పెరగడంతో, అవి బయటకు చిన్న కంతుల వలె కనిపిస్తాయి. వీటిని రుమటాయిడ్ నాడ్యూల్స్ అని అంటారు. • వీటితో పాటు నీరసం, రక్తహీనత, బరువు తగ్గడం, ఆకలి తగ్గిపోవడం, జ్వరం వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు. • ఈ వ్యాధి ప్రభావం - ఇతర ప్రధాన అవయవాలైన కళ్ళు, చర్మం, రక్తనాళాలు, గుండె, ఊపిరితిత్తులపై మరియు మూత్రపిండాలపై ఉండటం వలన కళ్ళు మరియు నోరు పొడిబారడం, ఛాతీలో నొప్పి, దగ్గు, శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది తలెత్తడం, రక్తనాళాల్లో కొవ్వు పేరుకుపోవడం వలన గుండెనొప్పి వంటి లక్షణాలను గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సి.బి.పి., ఇ.ఎస్.ఆర్., ఆర్.ఏ. ఫ్యాక్టర్, ఏ.ఎన్.ఏ. యాంటీ సి.సి.పి., ఎక్స్-రే, ఎమ్.ఆర్.ఐ. మొదలైన పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** చాలా రకాల ఆటో ఇమ్యూన్ వ్యాధులు 'సైకో సోమాటిక్ డిజార్డర్స్' క్రిందకు వస్తాయి. అన్ని రకాల సైకోసోమాటిక్ డిజార్డర్స్‌కు హోమియోలో చక్కని పరిష్కారం లభిస్తుంది. ఆటో ఇమ్యూన్ వ్యాధులకు ఇతర చికిత్సా విధానాలలో శాశ్వత నివారణ లేదు, కేవలం తాత్కాలిక ఉపశమనం మాత్రమే లభిస్తుంది. కానీ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే కాన్‌స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా, రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకుని, చికిత్స అందించడం ద్వారా ఈ వ్యాధి సంపూర్ణంగా నయం అయ్యే అవకాశం ఉంది. అంతేకాకుండా ఇతర కాంప్లికేషన్స్ బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

ADVT




హోమియోకేర్® ఇంటర్‌నేషనల్
వరల్డ్-క్లాస్ హోమియోపతి

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం 955 000 1199

www.homeocare.in



# అనుగ్రహం

25 జూన్ - 1 జూలై 2017

డాక్టర్ పి.ఎ. రామన్



**మేషం**

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

అవిశ్రాంతంగా శ్రమిస్తారు. పనులు సకాలంలో పూర్తి అవుతాయి. కొత్త విషయాలు తెలుసుకుంటారు. ఖర్చులు విపరీతం. పరిచయాలు మీ ఉన్నతికి దోహదపడతాయి. సంప్రదింపులకు అనుకూలం. భేషజాలకు పోవద్దు. మీ ఇష్టాయిష్టాలను లౌక్యంగా వ్యక్తం చేయండి. దంపతుల మధ్య సఖ్యత నెలకొంటుంది. నోటీసులు అందుకుంటారు. నగదు లావాదేవీల్లో జాగ్రత్త.



**తుల**

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

కొత్త బాధ్యతలు స్వీకరిస్తారు. హామీలను నిలబెట్టుకుంటారు. పరిచయాలు పెరుగుతాయి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. శనివారం నాడు పనులు హడావుడిగా సాగుతాయి. ఆసక్తికర విషయాలు తెలుసుకుంటారు. మీ విషయాల్లో ఇతరుల జోక్యం ఇబ్బంది కలిగిస్తుంది. పిల్లల ద్వారా శుభవార్తలు వింటారు. జూదాలు, పందాల వల్ల అవస్థలు తప్పవు.



**వృషభం**

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ఈ వారం అనుకూలమే. బాధ్యతగా వ్యవహరిస్తారు. ఇంట్లో సందడి నెలకొంటుంది. వ్యతిరేకులు కూడా సన్నిహితులవుతారు. ఖర్చులు అంచనాలను మించుతాయి. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. మీ యత్నాలు ప్రోత్సాహకరంగా సాగుతాయి. విలువైన వస్తువుల పట్ల శ్రద్ధ తీసుకోవాలి. అనవసర విషయాల్లో జోక్యం తగదు. వాహనం నడిపేటపుడు జాగ్రత్త.



**వృశ్చికం**

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

వ్యవహారాలు, లావాదేవీలు నిరుత్సాహపరుస్తాయి. ఏ విషయంపై ఆసక్తి ఉండదు. ఆలోచనలు పలు విధాలుగా ఉంటాయి. ఖర్చులు అధికమవుతాయి. ఆత్మీయులను కలుసుకుంటారు. పెద్దల ఆరోగ్యం కుదుటపడుతుంది. అయినవారితో సంప్రదింపులు జరుపుతారు. ఇతరులకు మీ బ్యాంకు వివరాలను వెల్లడించవద్దు. మీ జీవిత భాగస్వామి సలహా పాటించండి.



**మిథునం**

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

అప్రమత్తంగా ఉండాలి. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. సాయం చేసేందుకు అయినవారే సందేహిస్తారు. ఆప్తుల కలయిక సంతోషపరుస్తుంది. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. ఆలోచనలు పలు విధాలుగా ఉంటాయి. జూదాలు, బెట్టింగ్‌లకు దూరంగా ఉండాలి.



**ధనుస్సు**

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

మీదైన రంగంలో రాణిస్తారు. పదవులు, సభ్యత్వాల స్వీకరణకు అనుకూలం. ప్రత్యర్థులు సన్నిహితులవుతారు. ప్రజా సంబంధాలు విస్తరిస్తాయి. మంగళ, బుధ వారాల్లో స్వల్ప అస్వస్థతకు గురవుతారు. కొన్ని విషయాల్లో మీ జోక్యం అనివార్యం. మీ సలహా ఎదుటివారికి లాభిస్తుంది. బంధువులతో సత్సంబంధాలు నెలకొంటాయి. విదేశీ విద్యకై చేసే యత్నం ఫలిస్తుంది.



**కర్కాటకం**

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

లక్ష్య సాధనకు ఓర్పు ప్రధానం. పట్టుదలతో యత్నాలు సాగించండి. మీ కృషి త్వరలో ఫలిస్తుంది. చేతిలో ధనం నిలబడదు. ఆది, సోమ వారాల్లో పనులు ముందుకు సాగవు. ఆప్తుల సాయం అందుతుంది. మానసికంగా కుదుటపడతారు. కుటుంబ విషయాల పట్ల శ్రద్ధ అవసరం. ముఖ్యమైన పత్రాలు అందుతాయి. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు.



**మకరం**

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

వాగ్ధాటితో ఆకట్టుకుంటారు. మీ యత్నాలు ప్రోత్సాహకరంగా సాగుతాయి. పనులు సానుకూలమవుతాయి. కుటుంబ విషయాలపై శ్రద్ధ వహిస్తారు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. ఎవరి సహాయమూ ఆశించవద్దు. సంతోషకరమైన వార్తలు వింటారు. మనసు తేలికపడుతుంది. ఆత్మీయులను కలుసుకుంటారు. పిల్లలకు ఉన్నత విద్యావకాశం లభిస్తుంది.



**సింహం**

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

మీ కష్టం ఫలిస్తుంది. ధనలాభం పొందుతారు. ఆలోచనలు ఒక కొలిక్కి వస్తాయి. వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. వాయిదా పడిన పనులు పూర్తి చేస్తారు. మంగళ, బుధ వారాల్లో పరిచయం లేని వారితో జాగ్రత్త. కుటుంబ విషయాలు గోప్యంగా ఉంచండి. ఆత్మీయులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆరోగ్యం సంతృప్తికరం.



**కుంభం**

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

నిర్దిష్ట ప్రణాళికలతో ముందుకు సాగుతారు. మీ యత్నాలకు పరిస్థితులు కూడా అనుకూలిస్తాయి. ధనయోగం, వస్తులాభం పొందుతారు. ఖర్చులు అధికం. పెద్దమొత్తంలో ధనసహాయం చెయ్యవద్దు. మీ జీవిత భాగస్వామి వైఖరిలో మార్పు సంభవం. పనులు, బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. నమ్మకస్తులు మోసగించేందుకు యత్నిస్తారు.



**కన్య**

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

అవిశ్రాంతంగా శ్రమిస్తారు. పనులు నిదానంగా సానుకూలమవుతాయి. ఖర్చులు అధికం. అయినవారిని కలుసుకుంటారు. గురు, శుక్ర వారాల్లో భేషజాలకు పోవద్దు. నమ్మకస్తులే మిమ్మల్ని తప్పుదారి పట్టించేందుకు యత్నిస్తారు. పిల్లలకి ఉన్నత విద్యకై అవకాశం లభిస్తుంది. దంపతుల మధ్య సఖ్యత లోపం. ఓర్పుతో సమస్యలు పరిష్కరించుకోవాలి.



**మీనం**

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. ఊహించిన ఖర్చులే ఉంటాయి. పనులు నిదానంగా పూర్తవుతాయి. సన్నిహితులతో ఉల్లాసంగా గడుపుతారు. గురు, శుక్ర వారాల్లో అప్రమత్తంగా వ్యవహరించాలి. కుటుంబ, బ్యాంకు వివరాలు వెల్లడించవద్దు. నగదు, ఆభరణాలు జాగ్రత్త. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. కొత్త యత్నాలకు శ్రీకారం చుడతారు.

## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం:** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

ADVT

## స్పోర్ట్స్ క్విజ్ - 5




1. ఇదొక బేస్‌బాల్ స్టేడియం. ఇదెక్కడుందో చెప్పగలరా?
2. ప్రపంచ అమెచ్యూర్ బిలియర్డ్స్ టైటిల్ గెలిచిన తొలి భారతీయుడు ఎవరు?
3. 1983లో జైపూర్‌లో జరిగిన ఇండియా-పాకిస్తాన్ మ్యాచ్‌లో కొత్త నిబంధన అమలులోకి వచ్చింది, ఏమిటది?
4. 2016 సంవత్సరంలో సుల్తాన్ అజ్లాన్ షా కప్‌ని ఏ దేశం గెలుచుకుంది.
5. అంతర్జాతీయ హాకీ సమాఖ్య అంపైర్ ప్యానల్‌లో సభ్యురాలుగా ఎంపికైన భారతదేశానికి చెందిన అంపైర్ ఎవరు?

**జవాబులు :**

1. అమెరికాలోని న్యూయార్క్ నగరంలో ఉంది. దీనిపేరు యాంకీ స్టేడియం.
2. విల్సన్ జోన్స్. 1958లో కలకత్తాలో జరిగిన ప్రపంచ అమెచ్యూర్ బిలియర్డ్స్ ఛాంపియన్‌షిప్‌లో టైటిల్ గెలిచాడు.
3. నోబాల్స్, వైడ్స్‌ను బౌలర్లిచ్చిన పరుగుల్లో చేరుస్తారు. ఈ మ్యాచ్‌కు ముందు వీటిని ఎక్స్‌ట్రాస్‌లో కలిపేవారు.
4. ఆస్ట్రేలియా. మలేసియాలో జరిగిన సుల్తాన్ అజ్లాన్ షా కప్ హాకీ టోర్నమెంట్‌లో ఇండియాను 4-0 గోల్స్ తేడాతో ఓడించి కప్‌ను కైవసం చేసుకుంది.
5. దుర్గా ఠాకూర్. న్యూజిలాండ్‌లోని హేస్టింగ్స్‌లో ఇటీవల జరిగిన 'హాక్స్ బే కప్' టోర్నమెంట్‌లో ఉత్తమ ప్రదర్శనకుగాను ఆమె అంతర్జాతీయ హాకీ సమాఖ్య అంపైర్ ప్యానల్‌లో సభ్యురాలుగా ఎంపికైంది.

## గత వారం జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ని | 2 ఘం | టు | 3 వు | ❄ | 4 రా | 5 చ | ❄ | 6 కా | మా | 7 క్షి |
| 8 గూ | టం | ❄ | 9 రు | 10 వే | ❄ | 11 క్ర | 12 తు | వు | ❄ | ప |
| ఢ | ❄ | 13 ఆ | ప | ద | ❄ | 14 వా | ద | న | ❄ | ణి |
| 15 ము | 16 స | లం | ❄ | 17 న | 18 ర | కం | ❄ | ❄ | 19 ఇ | ❄ |
| ❄ | 20 రి | బ | శ | ❄ | క్క | ❄ | 21 రే | 22 చీ | క | 23 టి |
| 24 మో | హ | న | ❄ | 25 బా | సి | 26 కం | ❄ | 27 క | టు | కా |
| 28 ము | ద్దు | ❄ | 29 పా | దం | ❄ | 30 ది | 31 వి | టి | ❄ | ణా |
| ❄ | ❄ | 32 ధూ | పం | ❄ | 33 బా | లి | క | ❄ | 34 మ | ❄ |
| ❄ | 35 తా | ళి | ❄ | 36 ధ్యా | స | ❄ | 37 ట | ము | కు | ❄ |
| 38 ఆ | ప్ర | పా | 39 లి | ❄ | ట | ❄ | క | ❄ | 40 టం | 41 కం |
| త్మ | ❄ | 42 శ్ర | క | ❄ | ❄ | 43 సా | వి | త్రి | ❄ | చె |

## పూరణం

నిర్వహణ : గొరుసు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ❄ | 4 | ❄ | 5 | | 6 | ❄ |
| 7 | | ❄ | 8 | | | ❄ | | ❄ | 9 | 10 |
| 11 | | 12 | ❄ | ❄ | ❄ | 13 | | 14 | ❄ | |
| | ❄ | 15 | 16 | | ❄ | ❄ | ❄ | 17 | | |
| ❄ | 18 | | | ❄ | 19 | 20 | 21 | | ❄ | ❄ |
| 22 | | | | ❄ | ❄ | 23 | | ❄ | ❄ | 24 |
| ❄ | | ❄ | ❄ | 25 | 26 | | ❄ | 27 | 28 | |
| 29 | | | ❄ | ❄ | 30 | | 31 | ❄ | 32 | |
| | ❄ | ❄ | 33 | 34 | | ❄ | 35 | | | ❄ |
| 36 | | 37 | ❄ | 38 | | ❄ | | ❄ | 39 | 40 |
| | ❄ | 41 | | | ❄ | 42 | | | ❄ | |

### అడ్డం

1. నువ్వే, నేనో .. తేల్చుకుందాం- మోహన కృష్ణ ఇంద్రగంటి కొత్త సినిమా (4)
5. తల రాతలు రాసేవాడు (3)
7. వగరులోనూ దుఃఖం ఉంది (2)
8. జబ్బు (3)
9. నువ్వు గింజ (2)
11. తానం ఆద్యంతాలుగా కొట్టడం (3)
13. పక్షి కంటితో వీక్షణం (3)
15. సంస్కృతం కిటికీ (3)
17. చెట్టుపూత కాదు, గాయానికి పూసే మలాం (3)
18. తెలుగు పైనాపిల్ (3)
19. తల దాచుకున్న ఉద్దేశం (4)
22. "- - - - పలుకవు ఓ జవరాల .." సినారె పాట (4)
23. పగ వంటిది (2)
25. కె. విశ్వనాథ్ వెండితెరకు అందించిన భరణం (3)
27. మనది ఏ జాతి? (3)
29. లెక్కల శాస్త్రం (3)
30. సబ్బునుండి వచ్చేది (3)
32. దీనికొచ్చి ముంత దాయడమెందుకు?- అట్నుంచి (2)
33. అరణ్యం- పేరుమారి దారి తప్పింది(3)
35. అట్నుంచి వచ్చిన నెమలి (3)
36. విభేదాలు తొలగించుకుని ఏర్పరచుకునే స్నేహం (3)
38. తప్పెట (2)
39. నిద్రపుచ్చే పాట - అట్నుంచి (2)
41. మరణించినవారి పట్ల తెలిపే సానుభూతి (3)
42. వాడుకలో అధరం (3)

### నిలువు

1. దేవుడు ఎత్తే రూపాంతరం (4)
2. పచ్చిపాలపై ఉండేది (3)
3. 'తమరు'కు మరో రూపం (2)
4. ఈ సంజీవని, చనిపోయినవారిని బతికించే విద్య (2)
5. ఎడబాటులో ప్రేమికుల మధ్య కలిగేది (3)
6. శవాన్ని కాల్చడానికి పేర్చేది (2)
10. కర్నూలు జిల్లాలోని ఒక పట్టణం- కింద నుండి (3)
12. తెలిసినా, తెలియనట్లు నటించే వారికిది నిక్‌నేమ్(4)
14. తలగడకు తొడిగేది (3)
16. ముక్కు మాత్రమే పసిగట్టగలదు (3)
18. తుమ్మెదలాంటి శిరోజాలుగల స్త్రీ (4)
20. పేచీ / వివాదం (4)
21. వంద వేలు (2)
24. కర్ణుడు ఏ కుండలాలతో పుట్టాడు?(3)
26. తెలుగు realization (4)
28. శ్రీశైల మల్లన్న కొలువుతీరిన అడవి (4)
29. - - - - అత్త, సొగసరి కోడలు! (4)
31. తన తప్పు తానెరుగని వారికి ఈ గింజ పోలిక (4)
34. క్షురకర్మ పనిముట్లు దాచే తిత్తి (3)
37. ప్రకృతిలో సంజ - కిందనుండి (2)
40. సన్యాసి (2)



కొస మెరుపు

# ఛత్రి... విచిత్రాలు!

ఇద్దరు కలిసి వెళుతున్నప్పుడు, వాన పడితే ఒకే గొడుగు కింద సర్దుకుని, సగం తడుస్తూ నడవాల్సిన ఇబ్బంది లేకుండా 'కపుల్ అంబ్రెల్లా' మార్కెట్లోకి వచ్చేసింది. దీంతో పాటే హృదయాకారంలోని గొడుగులూ ప్రేమపక్షుల్ని భలేగా ఆకర్షిస్తున్నాయి. అంతటి వర్షంలోనూ 'హరివిల్లు గొడుగు' అందర్నీ కట్టిపడేస్తోంది. 'ఇసాబ్రెల్లా' అనే కొత్తరకం ఛత్రి చూసేందుకు వైన్ బాటిల్‌లా ఉంటుంది కానీ, మూత తీయగానే ఠక్కున విచ్చుకుంటుంది. బైక్ నడుపుతున్నప్పుడూ.. సైకిలు తొక్కుతున్నప్పుడూ సాయంగా ఉంటుంది 'నూబెల్లా' గొడుగు. చేతులతో పట్టుకోలేని వారి కోసమే వచ్చింది 'షోల్డర్స్ అంబ్రెల్లా'. చీకట్లో ప్రయాణించే వారికి కాంతులిస్తుంది 'లైట్ అంబ్రెల్లా'. కత్తికే కాదు, గొడుగుకూ రెండు వైపులా పదునే అంటాయి 'డ్యూయల్ సైడ్ గొడుగులు', ఈ వర్షం సాక్షిగా ఏదో ఓ గొడుగు కింది దూరిపోండి!

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు

# పుస్తకముల పట్టిక

(Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.



Like us to follow :

**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

